కాంగ్రెసు ప్రచురణములు :- 1.

# శ్రీ గాంధీ జయంతి

డా॥ భోగరాజు పట్టాభిసీతారామయ్య

[ రచయిత ]

# మహాత్ముని
# వర్ధంత్యుత్సవ సప్తాహం.

## మహాత్ముని మహోపదేశము.

## అహింసాధర్మప్రభావము

డాక్టర్ బి. పట్టాభిసీతారామయ్యగారి వ్యాసావళి

### 1

గాంధిమహాత్ముని వర్ధంతి సప్తాహసందర్భమున దినమున కొక వ్యాసముచొప్పున ఏడువ్యాసములను వరుసగ ప్రకటింపదలంచితిని. ఈవర్ధంతిని వారములోని మొదటిదినము (2–10–37 తేదీ) అహింసా వ్రత దినముగాను, రెండవదినము ఖద్దరుదీక్షా దినముగాను, మూడవ నాడు మద్యవర్జన దినముగాను, నాల్గవదినము అస్పృశ్యతా నిర్మూలమునకై హరిజనవాసరముగాను, అయిదవదినము సర్వమత సంఘ సమైక్యదినముగాను, ఆరవదినము కాంగ్రెసు మంత్రివర్గములు సాధించిన సత్కార్యవిశేష సత్కాలక్షేప దినముగాను, ఏడవదినము ప్రజలును కాంగ్రెసు మంత్రులును ఇకముందు సాధించవలసిన భావికార్యక్రమమునకు కంకణ దీక్షాదినముగాను ఏడుదినములును జరుపబడవలెనని మద్రాసురాష్ట్ర ప్రధానామాత్యులగు శ్రీమాన్ సి. రాజగోపాలాచారిగారు సూచించిరి. కనుక పై జెప్పిన ఏడు విషయములకును ఏడు వ్యాసములను వర్ధంత్యుత్సవముల కనుకూలించునట్లుగా వ్రాయదలంచితిని. ఈ మొదటి వ్యాసము "అహింసావ్రతము" ను గూర్చి వ్రాయుచున్నాను.

గాంధిమహాత్ముని జన్మదినోత్సవసందర్భమున మన పూర్వ చరిత్రాంశముల నొకమారు సంస్మరించుట యుక్తము. గత 50 సంవత్సరములలోను కాలచక్ర మేరీతిగా తిరిగినదో నేడు మన రాజకీయరంగమున నొక మహాయోగి పుంగవుడు నాయకత్వము వహించుట కెట్టి సందర్భ కారణము లేర్పడెనో పరిశీలింపవలసి యున్నది. కాంగ్రెసు మహాసభ అనేక దశాంతర్దశలను పొంది క్రమవికాసమును చెందుచూ వచ్చినది. పూర్వుల వ్యవహారపద్ధతులను అనంతర తరములవారుఖండించి నిరసించుట సులభము. కాని, ఒక్క విషయమును జ్ఞప్తియందుంచుకొనవలెను. ఒక్కొక్క ఉద్యమములో ఉత్తరోత్తర గ్రహింపబడే నూతన విషయములన్నియును గతించిన పెక్కు పుష్కరములలో ప్రజలకు కలిగిన ఊహలును ఉద్దేశములును కాలక్రమేణ పరిపాకము నొందుటవల్లనే సిద్ధించినవని గ్రహింపవలెను. కాంగ్రెసు సభయొక్క మహావృష్టి ధర్మసంస్థాపనలయందు, ముఖ్యముగా పేర్కొనదగినదియును, భారతజాతికి గొప్పగా చెప్పుకొనదగినదియును, అఖిలలోక మార్గదర్శకమైనదియును అహింసా ధర్మావలంబనమే. దౌర్జన్యమును దౌర్జన్యరాహిత్యమువల్ల జయించి భారతజాతి తమ వ్యవహార సమస్యలను స్వదేశ వివాదములను పరిష్కరింపగల ప్రావీణ్యమును గడించినది. అద్భుత ప్రాచీన విజ్ఞానవైభవోపేతమైన భారతజాతి మహత్తరమైనదయ్యును ఒక చిన్న లంకలోని నవనాగరకజాతికి నేడు ఎదురొడ్డి నిలువవలసివచ్చినది. ఈపాశ్చాత్యజాతి తన ధైర్యసాహసములవల్లను తన రాజ్యాంగ తంత్రమువల్లను, తన భుక్తికి తగినభూమి స్వదేశములో లేనందువల్లను, జీవనోపాధికై అనేక ఆరాట పోరాటములపాలై కాలచక్రపరికల్పితమైన కారణాంతరములవల్ల భానుడస్తమింపని మహా సామ్రాజ్యము నొకటి సంపాదింపగల్గెను. బ్రిటిషు సామ్రాజ్యమునందు జరిగెడి కర్మకాండనంతయును కర్మసాక్షియైనభానుడు తన నిత్యప్రకాశముతో పరిశీలించుచుండవలయును గనుకనే, బ్రిటిషు సామ్రాజ్యమున భానుడస్తమింపజాలడని హాస్యోక్తిగా నర్థము చెప్పబడెను. భారతదేశమునకును బ్రిటను దేశమునకును సంఘటితమైన యీమహాసంఘర్షణములో భారతీయులకఖండవిజయ మొకటి లభించినది. ఈవిజయము రాజకీయార్థిక నైతిక బలసమన్వితమైయున్నది. ఆర్థికవ్యవహారములతోను, నీతిధర్మములతోను, రాజ్యాంగ విషయములకు సంబంధము లేదనే భేదభావము మనదేశములో నిప్పుడు మొట్టమొదటిసారిగా తొలగిపోయినది. మానవజీవిత వ్యాపారములన్నియును భగవత్కైంకర్యములేయనియు, మానవకర్మకాండ భిన్నములుగా నుండినను అవియన్నియును ఏకైక సర్వవ్యాప్త చైతన్యవిన్యాసములనియు భారతజాతి గ్రహించినది.

ఈమహాద్భుత భావపరివర్తనము ఈదేశములో ఎట్లు కలిగినది? పురాతన ప్రసిద్ధిగల ఈభారతదేశము నేడు పరాధీనమై విదేశీయులకు బానిసయై పడియుండియును, ఈఆత్మ తేజోవికాసవిజయమును పొందుటకెవడు సాధన భూతుడయ్యెను

గత 19 వ శతాబ్దమునందు మలినకూపములో పడియుండిన రాజ్యాంగ తంత్రము నేడొక నూతన విజ్ఞానముగా, నీతిశాస్త్రముగా, మతోపదేశముగా నెట్లు ఆవిర్భవించినది? ఈ ప్రశ్నలకు సమాధానము చాలకాలముక్రిందటనే చెప్పబడెను. గాంధిమహాత్ముని అహింసా సత్యములయందభిమానపూరితులైన భారతీయులు చెప్పిన సమాధానము కాదిది ఒక పాశ్చాత్య ప్రముఖుడైన ప్రొఫెసరు గిల్బర్టు ముర్రేగారు ఈ క్రిందిరీతిగా సమాధానమిచ్చిరి.

" దేహసౌఖ్యములనుగాని, శరీర సౌకర్యములనుగాని, పత్రికల దూషణములనుగాని, పారితోషికములనుగాని, లక్ష్యము చేయనట్టి ఈమానవునితో వ్యవహరించునప్పుడు చాల మెలకువగా నుండవలెను. తనకు ధర్మమని న్యాయమని తోచిన వానినే తాను సాధింపవలెనని అతడు స్థిరసంకల్పుడై యుండును. అట్టివాడు చాలా ప్రమాదకరుడైన దురవగాహియైన శత్రువు. ఎందువల్లననగా, అతని శరీరమును బంధించి మీరు జయించినంతమాత్రమున అతని ఆత్మబలమును మీరు కించిత్తయిన హస్తగతమొనర్చుకొనజాలరు. "

తన దేహమును తానుకఠినతపస్సుచే నిగ్రహించి ఆత్మను తేజమునకు దేహమును వశపరచుటవల్లనే తన నూతన ధర్మసిద్ధాంతములను బోధింపగలిగెను. భారతదేశ రాజకీయరంగము నంతను తన నూతనసిద్ధాంతములతో సారవంతమొనర్చెను. స్వదేశాభిమానము స్వలాభకాంక్షగా కలుషితమై యుండినప్పుడు ఆకల్మషము నితడు కడిగివేసి పరస్పర మానవప్రేమగా దానిని శుద్ధిచేసెను. భారతీయుల స్వజాతీయాభిమానమును సర్వమానవసోదర భావముతో నితడు సమన్వయించి చూపెను.

మానవజీవితమునకు సంబంధించిన ఏసమస్యయైనను నీతిధర్మములకుగాని మతధర్మములకుగాని విరుద్ధముగా నుండజాలదని యితడు నిరూపించెను. మతమును నది ఆరాధనపద్ధతులకుగాని ఆగమ సూత్రములకు గాని సంబంధించినదని తలంచెడి కాలము చాలకాలముక్రిందటనే గతించినది. సోదర మానవ సేవచే పెంపొందు త్యాగబలమే అన్నిమతములకును పరమపవిత్రమైన ధర్మదీక్షయని గ్రహింపవలెను. రాజకీయ మతధర్మ సూత్రముకూడ నదియే అందువల్లనే కాంగ్రెసుసభా సిద్ధాంతము నూతనాకృతిని దాల్చినది. పరిపాలనావిధానములోని మార్పులకై డొంక తిరుగుడు తంత్రోపాయము లెన్నుచు తప్పించుకొనుచు కాలము గడపిన కాంగ్రెసు మహాసభ నేడు స్పష్టముగా నూటిగా భారతజాతీయాభీష్టమును నిర్వచించినది. " శాంతియుతమైన, సక్రమమైన సాధనములచే స్వరాజ్యమును సాధింపవలెను. " శాంతియుతమైన సక్రమమైన " అను మాటలకు బదులుగా " సత్యసమ్మతమైన దౌర్జన్యరహితమైన " అను మాటలను

చేర్చవలెనని గాంధీజీ ప్రయత్నించెను. దౌర్జన్యరాహిత్యమే శాంతియుతమైన మార్గమనియు, సత్యసమ్మతమైనదే సక్రమమనియు ఆయనమతము. అసత్యపద్ధతులవల్ల సులభముగా శీఘ్రముగా కార్యములు సాధింపబడుట కలదు. అనీబీసెంటమ్మ చెప్పినట్లుగా సత్యమునకంటె అనుమానములు ముందుగా అసత్యము ముందంజవేయగలదు. వివిధవిజ్ఞానసంస్కార విభేదములుగల 35 కోట్లప్రజలు యీదేశములో తమహక్కులను విద్యుక్తధర్మమును గ్రహించి ఒక్కమారుగా నిద్రమేల్కొని ప్రబోధితులగుట సులభసాధ్యము కాదు. అహింసాసత్యముల తత్త్వము ప్రజల నావహింపని యెడల యింతటి ప్రజాబాహుళ్య ప్రబోధము కలిగియుండెడిదికాదు. కాబట్టి కాంగ్రెసుమహాసభ సాధించిన మహత్కార్యమును రాజ్యాంగ పరివర్తనముల బట్టి కొలచి లెక్కించుటకు వలనుపడదు. అఖండమయిన యీభారతజాతి తనపరాధీనత నొక్కమ్మడిగా నెట్లు గ్రహింపగల్గినదో, తన సత్వరవిమోచనమున కెట్లు పరితపింపగల్గినదో గ్రహింపగల్గుటకు స్థూలదృష్టికి గోచరములైన దుర్గ్రాహ్యములయిన సూక్ష్మాధార ప్రమాణములతో పరిశీలింపవలెను.

దేశదాస్యవిమోచనకై కాంగ్రెసు మహాసభ యిదివరలో పలువిధములైన పాట్లుపడినది. రాజ్యాంగ సంస్కరణమునకై పాటుపడిన యుగముగడచినది. ఆరాజ్యాంగ సంస్కరణమును అధిక్షేపించిన దినములుగూడ కలవు. [illegible] రాజ్యములలోనున్న ప్రభుత్వపద్ధతి కావలెనని కొన్నివాళ్లు, ఐర్లాండులోవలె హోంరూలు కావలెనని కొన్నివాళ్లు, స్వరాజ్యము కావలెనని కొన్నివాళ్లు, వీలైతే బ్రిటిష్ సామ్రాజ్యములోనే చేరియుండి స్వపరిపాలనాధికారముండవలెననియు, అవసరమైతే సామ్రాజ్య సంబంధంలేని స్వరాజ్యము కావలెననియు కొన్నివాళ్లు భారత జాతీయాభీష్టము నిర్వచింపబడెను. చిట్టచివరకు సంపూర్ణ స్వాతంత్ర్యమే పూర్ణ స్వరాజ్యమే, (మకమ్మత్ అజదీ) కావలెనని ఖండితంగా నిస్సంశయముగా నిర్వచింపబడెను. యూరోపు ఖండములో సామ్రాజ్యములు తలక్రిందులై సామ్రాట్టులు సంహరింపబడుచున్న యీయుగములో అచటి రాజకీయ తంత్రాంగమంతయును భిన్నకక్షల పరస్పర స్పర్ధలతో విషమించుచున్న యీయుగములో భారతదేశము యొక్క పరమావధి సంపూర్ణ స్వాతంత్ర్యమేయని ఘంటాపథముగా అఖిల భారత జాతీయ మహాసభ చెప్పగల్గుటకు నాయకత్వము వహించెడి మహాపురుషుడు మహోపదేశికుడై, అనర్గళవాగ్ధాటికలవాడై, రాజ్యాంగ వ్యూహప్రవీణుడై యుండుటయేగాక అకళంక పరిపూర్ణుడైన పురుషోత్తమునిభంగి, మహాయోగివలె తత్త్వవేత్తవలె నిర్దుష్ట గుణశీల సంపన్నుడై యుండవలెను. అహింసాధర్మము నింకను ప్రపంచములోని యితరదేశములవారు గ్రహించి గణుతింపవలసియున్నారు. పాశ్చాత్య నాగరికతా వాసనలు పట్టువడియున్న భారతదేశ జనబాహుళ్యమింకను యీఅహింసామార్గమును నిత్యకృత్యానుష్ఠానముగా సాధకము చేయవలసియున్నది. మానవుని యందు సజ్జనత్వము లేనిచో లోకమునకు శాంతిలేదు. ఎప్పటికప్పుడు సంక్షో

భము సమాసన్నమగును. అట్టి సత్యగుణమే, అహింసా తత్త్వమునకు, ఆయువుపట్టు. శత్రువును జయించుట మానవధర్మము కాదు, ఎవరిని బెదరించక హితము చెప్పి యొప్పించుట మానవధర్మము. సమరమార్గమును వీడి సౌమ్యమార్గము నవలంబించుట యుత్కృష్ట మానవధర్మమనునది జగద్విదితమైన సత్యము. అందువల్లనే అహింసా మార్గము లోక సమ్మతమై వ్యాప్తి జెంద నేర్చును. ప్రతిమానవునకును కొన్ని హక్కులుండిన రీతిగానే, కొన్ని విధ్యుక్త ధర్మములుకూడ కలవు. మనహక్కులెంతటి పరిధానాంశములో మన బాధ్యతలును అంతటి పరిధానాంశములను మాత్రము ననుసరించి అహింసా ధర్మము వర్తించుచుండును. నీవొక బాధ్యతను వహింపవలయుననుటకు నీసహచరుల కొరకు హక్కుగా ఏర్పడి యున్నది. ఈమహోపదేశతత్త్వము ననుసరించియే భారత జాతి కోరునట్టి స్వరాజ్య తత్త్వమంతయును సూక్ష్మ వికాసమును పొందినది. ఒక ప్రభుత్వాధికారము క్రింద ప్రజలనుభవించెడి దాస్యమును తొలగించిన యెడల మరొక ప్రభుత్వాధికారమునకు ప్రజలు అధీనులయి యుండవలెనని కోరినట్లగును గనుక, ప్రతివ్యక్తియును, తన దాస్యమును తాను తొలగించుకొనవలసి యుండును. అదియే సంపూర్ణస్వాతంత్ర్య మనిపించుకొనును. ప్రతి వ్యక్తియును స్వతంత్రుడై తన దాస్యమును వదలించుకొన్న యెడల ప్రతిగ్రామమును స్వయంసమర్థమై స్వతంత్రమయి వర్ధిల్లును. ఆగ్రామములో ప్రతి జనసంఘమును స్వాతంత్ర్యము ననుభవింపగలదు. ఆశాపిశాచము ప్రజలను పీడింపజాలదు. భయపిశాచము ప్రజలను బాధింపజాలదు ఆరెండుపిశాచములే లోకకంటకములైయున్నవి. మానవుని దురాశయే దుఃఖమునకు చేటు. తనయాశలు ఫలింపజాలవేమోయని సదా భయపడుచుండును. తన యిరుగుపొరుగువాని జూచి వెరగందువాడే ఆశాపీడితుడగును. ఈవిధముగా ఆశవలన భీతియును, భీతివలన ఆశయును వృద్ధియగుచుండును. ఆశయును, ఆత్మభీతియును పోయినప్పుడే పొరుగువానిమేలు తనకు మేలుగా భావింపగలుగును. వానిఆరోగ్యమే తనకుఆరోగ్యప్రదమని గ్రహించును. వానికి సుభిక్షమయినప్పుడే తనకు శ్రేయస్సని గ్రహించును. మానవులు పరస్పర సంబంధములేని వ్యక్తులు కారనియు అన్యోన్యాశ్రితులనియు గ్రహించును. అప్పుడే మానవులు పరస్పర శ్రేయోభిలాషులగుదురు.

“ సర్వేజనా స్సుఖినోభవంతు ” అనెడి సనాతన స్వస్తివాక్యమే మహోద్భూత సత్యాగ్రహ సంకీర్తనములోని అంతర్గత స్వరప్రస్తారమని గ్రహింపగల్గుదురు. అందువల్లనే యీఅహింసాతత్త్వ ప్రభావమువల్లనే కాంగ్రెసు మహాసభ నేడు రాట్నమును చేపట్టినది. చేతిపనులను గృహపరిశ్రమలను, గ్రామపరిశ్రమలను ఉద్ధరింప సమకట్టినది. గ్రామవాసులందరును తమ జీవితావసరములను తాము సమిష్టిగా తయారుచేసి గ్రామమును స్వయంసమర్థముగా చేయవలెనని కాంగ్రెసు కోరుచున్నది. మనదేశములోని రాజకీయపక్షము నంతను చక్కజేయుటకు కాంగ్రెసుసమకట్టినది. భారతజాతిని ఆర్థికవ్యవహారములలోను సాంఘికాచార పద్ధతులలోను నీతి నియమ మార్గములలోను ఒక్కమాదిగా పునరుజ్జీవింపజేయవలెనని గాంధిజీ పూనుకొనెను

ఖద్దరుద్యమమును ప్రారంభించిన కొలది దినములలోనే స్వరాజ్యసంపాదనమున కది ప్రధానసాధనముగా పరిగణింపబడెను. కాంగ్రెసు పక్షపుమంత్రులు ప్రభుత్వాధికారమును వహించిన నేడు ఖద్దరువస్త్రము రాజద్రోహుల చిహ్నముగాలేదు. నూతనతేజమును పొందిన భారత జాతికది గౌరవలాంఛనముగా వెలసినది. యీ విధముగా తన ఉద్యమము ఫలించుటకు గాంధీమహాత్ముడనేక శుష్కోపవాసములను చేసెను కాని మహాత్ముడు సంకల్పించిన పరోక్షమహాసంస్కరణమునదగిన అస్పృశ్యతానిర్మూలనమునకై అతడు ఆమరణాంతము ఉపవాసము చేసెదనని కూడ దీక్షవహించెను. తనజీవితమును దానికై ధారవోయనెంచెను. ఈరెండు మహోన్నతకార్యముల నతడు సాధించినపిమ్మట మద్యపాన నిర్మూలనమున కతడు పూనుకొనునని యెంచితిమి కాని మనము భయపడినరీతిగా జరుగలేదు అంతకంటె సులభమార్గమునసే మహాత్మునికోరిక యీడేరుటకు అవకాశము కలిగెను. మన ఆర్థికాభివృద్ధికి ఖద్దరు మహామంత్రమునున్ను, మన సాంఘికాభివృద్ధికి అస్పృశ్యతా నిర్మూలన మంత్రమునున్ను, మన నైతికాభివృద్ధికి మద్యనిషేధమంత్రమునున్ను మహాత్ముడు మనకు బోధించెను. అహింసావ్రత నిష్ఠాగరిష్ఠుడైన యీమహాయోగిపుంగవుడు యీ మూడు మంత్రరాజములవల్లను స్వరాజ్యమను స్వారాజ్యమునకు సోపానముల నిర్మించి భారతజాతికి మోక్షమార్గమును జూపించెను.

దౌర్జన్యరహితమైన అహింసాతత్వము సామాన్య పామరజనుల కందరికిని అనుష్ఠానయోగ్యమగునా యని చాలమంది శంకించుచున్నారు. అట్టివారికి సమాధానము చెప్పవలసియున్నది. మతమునకు సంబంధించిన వేదాంతతత్వముగాని భగవంతుడున్నాడనుటకు గల ప్రమాణముగాని సామాన్యపామరుడు గ్రహింపగల్గినవి కావు. అట్లయ్యును, ఆ భగవద్భక్తియే, ఆ మతవిశ్వాసమే జనబాహుళ్యము నావేశించియున్నది. ఆభక్తి విశ్వాసములతో మానవులు తమ ఐహికవ్యాపారములందు భక్తిప్రబోధమును ఆత్మధైర్యమును పొంది పాపభీతిగల్గి నయమార్గవర్తనులై వ్యవహరించుటయే గాక, సాటిమానవులతో సోదరతుల్యులై దయాదాక్షిణ్యములు కలిగి వర్తించుచున్నారు. కాని సత్యాగ్రహమునునది పైజెప్పిన పారలౌకికవిషయముల కన్నను సులభగ్రాహ్యమైనది. దానిలోని అంతరార్థమునొకమారు గ్రహించిన యెడల అది సులభముగా బోధపడును. అన్నిమతములును మొట్టమొదట సులభగ్రాహ్యములైన మూలసూత్రములతో ప్రతిపాదింపబడియుండెను. అనంతరము వేదాంతులనేకులు ఆ మతసిద్ధాంతములకు అతిక్లిష్టమైన వ్యాఖ్యానములను భాష్యములను రచించిరి. ఈభాష్యకారులెంత అగమ్యగోచరముగా వాక్యార్థములు చేసినను కరతలామలకములైన మూలసిద్ధాంతములు ప్రజాహృదయమున నాటుకొనుచునేయున్నవి. ఆమత విశ్వాస ప్రభావమువల్లనే ఆయామతములలో మహాత్ములుదయించి ఆయామతముల కఖండవ్యాప్తివిఖ్యాతి దిగ్విజయముగా లభింపగల్గెను. ఇకాగ్ర్యలమునగూడ, అపరిపక్వమయిన సత్యాగ్రహోద్యమము సాత్వికనిరోధ

ముగా ప్రారంభమయి మనము చెప్పుకొని యుప్పొంగదగిన యుద్యమమయినది.
కాని, యీయుద్యమములో చేరినవారు ద్వేషభావమును దౌర్జన్యమునుకూడ కొల్ల
దిగా చూపుచూవచ్చిరి. ఈసత్యాగ్రహమే, సహాయ నిరాకరణోద్యమముగా
వికసించెను. అదియే శాసనోల్లంఘనముగా పరిణమించెను. ఈఉద్యమమున
కంతకును దౌర్జన్యరాహిత్యమే ప్రధానాంశమని ప్రజలకు బోధించుటలో గాంధి
మహాత్ముడు భగీరథ ప్రయత్నము చేసెను. ఇది దౌర్జన్యరహితమయిన సహాయ
నిరాకరణోద్యమమని బోధించినప్పుడు సహాయనిరాకరణ లక్షణము దౌర్జన్యరహిత
మను విశేషణమునందు చెప్పబడెను. విశేష్యము నెంతప్రధానముగా గమనించ
వలెనో విశేషణమునుకూడ అంత ప్రధానముగా గమనించవలెనని ప్రజలు గుర్తెరిం
గిన పిమ్మట సత్యాగ్రహోద్యమ మారంభింపబడెను. అట్టిచో అహింసాదీక్ష
మానవుని నిర్వృత్త్యావస్థ కాదనియు ప్రవృత్త్యావస్థయనియు స్పష్టమయ్యెను.
అహింసా వ్రతమనగా అపారమైన ప్రేమ, ఆ ప్రేమ వహ్ని పరులను దహించక
తన్నుతాను దహింప జేసికొనును. సత్యాగ్రహము అనాదినుండియు ఆర్యావర్త
మునే ఆశ్రయించియున్నది. పూర్వయుగములందు మహర్షులు అహింసాసత్యా
వలంబులై అవరోధమునన్నింటిని అతిక్రమింపగల్గిరి. సత్యాగ్రహుడు సత్యాన్వేష
ణుడై ఏమనుష్యునకైనను భయపడరాదు. ప్రభుత్వమునకును దారిద్ర్యమునకైనను,
మరణమునకైనను వెరువరాదు. త్యాగము, వినమ్రత, ఆరెంటివల్లను ఆవిర్భవించెడి
ఆత్మధైర్యము సత్యాగ్రహసాధనవల్ల కలుగును. ఇటువంటి సాధనమునే దివ్యాస్త్ర
ముగా అవలంబించిన రాజకీయ తంత్రమంతయును అకళంకమై ఆత్మతేజోబలసమ
న్వితమై విలసిల్లును పెక్కు సంవత్సరములు నిర్బంధప్రవాసులైన కాకోరీఖైదీలును,
అండమాను ఖైదీలును అహింసావ్రత దీక్షాప్రభావమును తలపని తలంపుగా గ్రహిం
చినవారై తమ రాజకీయ దౌర్జన్యపద్ధతులను విడనాడితిమని ప్రకటించిరి. భారత
దేశమునకే గాక అఖిలప్రపంచమునకును వేదోక్త నూత్నయుగారంభమైనది. యుద్ధ
మును, యుద్ధవదంతులను ప్రబలియున్న యీదినములలోనే స్వదేశాంతర్వివాదము
లును అంతర్జాతీయ సమస్యలు కూడ సమరము వల్ల గాక సామరస్యము వల్లను
హింసవలన గాక అహింసవలనను పరిష్కరింపబడుట మన జీవితకాలములోనే
మనము చూడగల్గుదుము గాక!



# 2 వ వ్యాసము.

## రాట్నపరిశ్రమను ప్రోత్సహింపవలసిన ఆవశ్యకత

## గృహపరిశ్రమలన్నిటిలోను ఖద్దరు ఉత్తమమైనది.

—— (*) ——

కుటుంబముయొక్క పవిత్రతను ఖద్దరు రక్షించును.

సర్టిఫైడు ' ఖద్దరునే అందరు కొనవలెను.

గాంధి వర్ధంత్యుత్సవ సప్తాహమునందు రెండవరోజును ఖద్దరు, మద్యపాన నిషేధము, అస్పృశ్యతా నివారణము అను నివి మూడును స్వరాజ్యసాధమునకు బునాదులని చెప్పవచ్చును. ఈ 15 సంవత్సరములనుండియూ గ్రామపరిశ్రమలను, గ్రామ పరిశ్రమలలో మేటియనందగు ఖద్దరును దేశములో వ్యాపింపజేసి, తద్వారా జాతీయజీవనమును పునర్నిర్మించుటకు మన మెందుకు పూనుకొంటిమను విషయమిచ్చట దీర్ఘముగా వివరింప బనిలేదు. ఒకానొక సమయమున భారత దేశప్రజలు చేతితో వడికి, చేతితో నేసిన వస్త్రములనే ధరించుచుండిరను విషయమును ప్రజలెరుంగకపోవుట శోచనీయము. ఈస్టిండియా కంపెనీవారు భారత దేశమున కెందుకు వచ్చిరో ప్రజలు తెలిసి కొనకున్నారు, దేశములో రాట్నములపై వడికినసూలును చేతి మగ్గములమీద నేయించి, ఆగుడ్డను సముద్ర

తీరప్రాంతమున గిడ్డంగులలో నిలువచేసి, దానిని ఐరోపాఖండ దేశములలో నమ్ముకొని విస్తారముగా లాభములు పొందుటకు ఈస్టిండియా కంపెనీవారి దేశమునకు వచ్చిరి. 1682 సం॥ లో ఇంజనులుగాని, ఫ్యాక్టరీలుగాని నీటియావిరిపై నడుపబడు యంత్రములుగాని లేకుండెను. ఈవర్తకులు ఈదేశమునుండి విదేశములకు గొంపోవుచుండిన గుడ్డపై 100 కి 300 వంతులు లాభము పొందుచుండిరి. ఒకానొక సమయమున సంపన్నులగు ఆంగ్లేయుల భవనములలో పరచుటకై ఉపయోగింపబడుచు వచ్చినగుడ్డ కాలక్రమేణ రాణులకోమలాంగముల నలంకరించుట కుపయోగపడెను. ఈవిధముగా దేశము నంతటిని భారత దేశవస్త్రమయము గావించి, ఆంగ్లవస్త్రపరిశ్రమను నాశముగావించిన కంపెనీని ఆంగ్లప్రజలు పరిహసించుచుండిరి. భారత దేశమునందు మూర్షదాబాదులో తయారయిన పట్టుబట్టలు ఆంగ్లరాజులయొక్కయు, ప్రభువులయొక్కయు, సంపన్నులయొక్కయు దేహముల నలంకరింపజొచ్చెను. ఈదుస్థితి జూచి ఆంగ్లకవియగు డేనియల్ డీఫో వారి నెత్తి పొడిచెను. ఆంగ్ల దేశముయొక్క వ్యాపారము నెట్లు భారతదేశ వస్త్రములు నాశము చేయుచుండెనో యెరుంగక ఆవస్త్రములను వారు వాడుచుండిరని ఆయన వ్రాసెను.

## —♦ భారతదేశ వస్త్రములపై నిషేధములు ♦—

భారతదేశమునుండి దిగుమతియైన పట్టుబట్టలను కట్టినవానికి 5 పౌండ్లు జరిమానా విధించుచు 1700 సంవత్సరమున నొక శాసనము గావింపబడెనను విషయము ప్రసిద్ధము. భారతదేశమునుండి వచ్చిన పట్టు అమ్మినవారికి 25 పౌండ్లు జరిమానా విధించు శాసనము 1735 సం॥ లో గావింపబడెను. శవమును ఆంగ్లదేశమున చేయబడిన ఉన్నిబట్టలతోగాక మరియే బట్టలతోనైనను చుట్టి ఖననము చేయుచో నట్టివారికి 5 పౌండ్లు జరిమానా విధించుచుండిరి. భారతదేశపు పట్టును ఆంగ్లదేశములోనికి రాకుండ చేయుటకు వారు విపరీతములగు సుంకములు విధించుచుండిరి. ఈమార్గములవలన విదేశవస్త్రములు తమదేశములోనికి ప్రవేశింపకుండ వారు చేసిరి. ఇంతలో నీటియావిరిచే యంత్రములు నడుపుట కనుగొనబడెను. వడుకుటయు, నేయుటయు నీటి యావిరి శక్తిచే జరుపబడుచుండెను. సుంకములచే ఆంగ్లేయులు మన వస్త్రములను నిషేధించినదానికంటె నీటియావిరిచే వస్త్రములను ఆంగ్లేయులు ఉత్పత్తి చేయుటవలననిషేధము శక్తివంతమయ్యెను. ఆంగ్లదేశములో వస్త్రముల ఉత్పత్తి విపరీతముగా హెచ్చెను. యంత్రశక్తివలన మలమల్, పొందూల లెక్కలనుగాక టన్నులు, హండ్రెడ్ వెయిట్లు లెక్కను ఉత్పత్తి జరిగెను. పూర్వము మనగుడ్డను దిగుమతి చేసికొనుచుండినవారు యిపుడు మనదేశమునకే గుడ్డ యెగుమతిచేయ మొదలిడిరి. 1803 సం॥ లో 3లక్షల రూపాయిల విలువగలగుడ్డ మనదేశమునకు దిగుమతియయ్యెను. 1829 లో 29 లక్షలు, 1929 సం॥ లో 66 కోట్ల రూపాయల విలువగల గుడ్డ 6 కోట్ల విలువగల నూలు మనదేశ

మునకు దిగుమతియయ్యెను. ఈవిధముగా లాంకుషైరుబట్టలకు భారతదేశము మార్కెటు అయ్యెను. భారతదేశములో బ్రిటిష్‌వారిరాజ్యము లా, ఆర్డరుపైగాక, భూమిసిస్తు విధానముపైగాక, విశ్వవిద్యాలయ విద్యపైగాక, కోర్టులు, కళాశాలలు, కౌన్సిళ్లపైగాక యంత్రములచే నడుపబడిన లాంకషైరువారి మగ్గములపై నాధారపడిన దగుచున్నది.

## భారతదేశముయొక్క వాణిజ్యపారతంత్ర్యము.

ఆంగ్లేయులు మనదేశమును మన విజ్ఞానమును మాత్రమేగాక మనవాణిజ్యమునుగూడ లోబరుచుకొనిరి. ఈవాణిజ్య విజయము అన్నిటికంటె గొప్పవిషయము. ఎందుకనగా ఆంగ్లేయులకు 5 వారములకు కావలసిన ఆహారమమాత్రమే ఆంగ్లదేశమునందు ఉత్పత్తి యగుచున్నది. తక్కిన 47 వారములకు ఆహారపదార్థములు విదేశములనుండి రావలసియున్నవి. విదేశములనుండి వారు దిగుమతిచేసికొను వస్తువులకు డబ్బివ్వవలెను ఎల్లకాలము తాము తెప్పించుకొను వస్తువులకు బంగారముగాని, వెండిగాని రొక్కముగా చెల్లించుట పీలుగాని దనిగాన, విదేశములనుండి వారు తెప్పించుకొను వస్తువులకు వారు వస్తురూపమున ద్రవ్యము చెల్లించుచున్నారు. అంతర్జాతీయ వాణిజ్యము సరుకులకు సరుకులిచ్చు వస్తుమార్పిడి పద్ధతిగానున్నది. ఈకారణముచే భారతదేశము ఆంగ్లేయుల సరుకులను కొనునట్లు చేయుట ఆంగ్లేయులకు శ్రేయోదాయకము మాత్రమేగాక అత్యవసరమునగుచున్నది. ఇట్లుకానిచో యితర దేశములనుండి ఆహారపదార్థములు ఆంగ్లదేశములోనికి రాకపోవుటవలన ఆహారపదార్థముల యభావమును, అందుచేత ప్రజలు మాడవలసినస్థితియు కలుగును. వాణిజ్యములో మనదేశమును తమకు పరాధీనమైనదిగా ఆంగ్లేయులు చేసికొనుట కదియే కారణము. 1905 సం॥ న బెంగాల్ విభజనమునకు అసమ్మతి దెలుపుటకుగాను మనము స్వదేశీవస్తువుల నుపయోగింప దలచినప్పుడు ఈవిషయమును కొంతవరకు మనము గ్రహించితిమి. అప్పుడు మనము వస్త్రములు, సబ్బులు, మైనపువత్తులు, పింగాణీసరుకుమాత్రమే చేయ దలపెట్టితిమి. తరువాత విదేశవస్తుబహిష్కారము తీవ్రరూపమును దాల్చినపుడు నిషేధమును మాని కొంచెము ధర హెచ్చుపెట్టవలసివచ్చినను స్వదేశీవస్తువులనే కొనవలెనని మనమితవాద మిత్రులు చెప్పసాగిరి. విదేశవస్త్రముల బహిష్కారమునకు యెక్కువ ప్రాముఖ్య మొసంగుట వారికిష్టములేక కొంత త్యాగము చూపియైనను మన దేశీయులు మనదేశ వస్తువులనే కొనవలెనని వారుచెప్పిరి, 1908 సం॥ లో గోఖ్లేగారు చెప్పిన దిదియే. ప్రజలు కొంతత్యాగము చేయవలెనని వారుగూడ కోరిరి. ఎందుకనగా, ప్రభుత్వమువారు మన పరిశ్రమలకు సహాయముచేయరైరి కనుక మొదట రకముగుడ్డను, రెండవరకముగుడ్డను హెచ్చురేటుపెట్టి కొని ప్రజలు స్వయం సహాయము చేసికొనవలెనని వారు కోరిరి. కావున 1908 నుండి 1915 సం॥ వరకు

కాంగ్రెసును వశపరచుకొనియున్న మితవాదుల తీర్మానములలో మనగుడ్డకు మనము రక్షణ యొసంగవలెనను సిద్ధాంత మిమిడియున్నది. హోంరూలు ఉద్యమములోగూడ స్వదేశీయే ప్రాముఖ్యము వహించెను.

## గాంధియుగము.

గాంధిమహాత్ముడు నాయకత్వము వహించిన తరువాత స్వదేశీభావము ప్రజలలో విశేషముగా వ్యాపింపజేయబడెను. బెంగాల్ విభజన కాలమునందువలె చేతిమగ్గములమీద నేసిన గుడ్డగాక చేతితో వడికినేసిన గుడ్డను ధరింపవలెనని ప్రజలు కోరబడిరి. చేమగ్గములవారిని ప్రభుత్వమువారుగూడ మరచిపోలేదు. ఇటీవల చేమగ్గముల పరిశ్రమకై కేంద్రప్రభుత్వమువారు 15 లక్షల రూపాయల సహాయముచేసిరిగూడను. కాని నేయువాడే నూలువడకవలెనని కోరినప్పుడేమగుచున్నది? నూలు, గుడ్డ నేయువాడు, ఈ పరిశ్రమకు ప్రోత్సాహము కల్పించువాడు ఈపరిశ్రమ కాధారభూతమగు సిద్ధాంతములు రాజద్రోహకరములయినవిగా నిషేధింపబడుచున్నవి.

మన యదృష్టవశమున ఆరోజులు పోయి నూతన రాజ్యాంగవిధానముక్రింద మంత్రులుగా నున్నవారుసైతము ఖద్దరు ధరించి, ఖద్దరునే ధరింపవలెనని ప్రజలకు ఉద్బోధించు రోజులు వచ్చినవి. ఖద్దరును ధరించుటవలన బీద గ్రామ ప్రజలకు కొంత సహాయము కలుగునని వారు చెప్పుచున్నారు. నగరములలో వకీలుగా నున్నవాడు టాక్సీ తెచ్చుకుఱ్ఱవానికి 4 అణాలు పారవేయునే. రాట్నముపై 8 గంటలు నూలువడికి ఒక అణా సంపాదించుట యెంతపాటి యని ప్రజలు పరిహసింపవచ్చును. నిజమే, ఒకఅణా చాలకొద్దియే, ప్రతియూర హైకోర్టులు కలవా? ప్రతియూర లక్షలకొలది ద్రవ్యము పోసికొను న్యాయవాదులు కలరా? భారతదేశములో 750 వేల గ్రామములు 2800 పట్టణములు కలవు. టాక్సీని తెచ్చుపిల్లవానికి నగరములో 4 అణాలు లభించినట్లే ప్రతి పల్లెలోను లభించునా? భారతదేశములో సంవత్సరమునకు సగటు ఆదాయము 48 రూపాయలని కర్జను ప్రభువు అంచనావేసెను. 24 రూపాయలని మనవారు అంచనా వేసిరి. కర్జనుప్రభువు చెప్పినదే నిజమని తలచినను నెలకు సగటున ఆదాయము 4 రూపాయలు, రోజుకు 2 అణాలు మాత్రమేగదా. 1 రోజుకు ఆదాయము 2 అణాలు మాత్రమే యైనప్పుడు రోజుకు 1 అణా ఆదాయము కలుగుట తక్కువన చెప్ప వీలగునా? ఈ అణా సంపాదించువారు తమ యిల్లు వదల నవసరములేదు. తమ యిష్టమువచ్చినప్పుడు పనిచేయవచ్చును. లేనప్పుడూరకుండవచ్చును.

## నూలు వడికినందుకు కూలి హెచ్చింపు

నూలు వడకువారికి కూలి హెచ్చింపవలెనని యిటీవల మహాత్ముడు కోరియున్నాడు. 8 గంటలు వడుకుట, 1 గంట యేకుటకు మూడణాలు తక్కువ గాకుండ యివ్వవలెనని ఆయన కోరియున్నాడు. తన సహచరులు కోరుటవలననే ఆయన యిట్లు చేసెను. ఈ రేట్లు అనగా 2, 3, లేక 4 అణాలు ఈ రాష్ట్రము యొక్క వివిధభాగములలో అమలులో నున్నవి. ఖద్దరు ధరలు అసలే హెచ్చు. ఇట్లు చేయుటవలన మరింత హెచ్చుచున్నవని ప్రజలు యెంతగగ్గోలు పెట్టినను ఈ రేట్లను ఖద్దరుప్రచారకులు అవలంబింప తప్పలేదు. ఖద్దరుధరలు హెచ్చుచున్న మాట వాస్తవమే కాని బీదలను రక్షించుటకై ధనికులు త్యాగము చేయవలసియున్నది, ధనికులసంపద బీదల కూలివలనగదా లభ్యమయ్యెను. బీదవాడగు కూలివాడు క్షేమముగా నుండుటయు, ఆతనిపనికి దగ్గకూలి యాతనికి లభించుటయు ధనికులకు గూడ క్షేమమే. పనివాడు సంతృప్తిపడినచో ధనికుల సంపదను యింకను వృద్ధిచేయుట కతడు శక్తిమంతుడై యుండును. ఈవిషయము నాలోచించినను వడికినందుకు కూలి హెచ్చించుట కెవ్వరును అభ్యంతరము చెప్పవీలులేదు. కావున ఆర్థికముగా జూచినను నైతికముగా జూచినను, రాజకీయముగా జూచినను ఖద్దరుకు మనము యిన్ని సంవత్సరముల నుండియు నిచ్చుచున్న ప్రాముఖ్యము నిరర్థకము కాదు, ఖద్దరును మనము ప్రోత్సహించుచున్నందుకు సిగ్గుపడవలసిన అవసరము యెంతమాత్రమును కనబడదు.

## 'సర్టిఫైడు' ఖద్దరునే కొనవలసిన ఆవశ్యకత.

ఈసమయమున ఒక్కవిషయమును చెప్పదగును. సముద్రపు ఆటుపోటులవలె రాజకీయమునందు గూడ ఆటుపోటులు కలవు. కాంగ్రెసువారు మంత్రులుగా నున్నందువలన ఖద్దరుయెడల ప్రజలు అభిమానోత్సాహములు కలవారై యున్నారు, ఈఉత్సాహమువలన వారు హెచ్చు ఖద్దరు కొందురు. ఈఖద్దరును సప్లయిచేయుటకు కుక్కగొడుగులవలె అనేకసంస్థలు బయలుదేరుచున్నవి. ఖద్దరు పరిశ్రమను పోషించుభారము అఖిలభారత చరఖా సంఘమువారిదై యుండెను. అట్టి యీఅఖిలభారత చరఖా సంఘమువారు ఖద్దరు అభివృద్ధికై కొన్నినియమములు విధించియున్నారు. ఖద్దరనగా రాట్నముపై తీసిననూలును చేమగ్గములపై నేయుటమాత్రమే గాదు. ఈపరిశ్రమయందు చేరియున్న ప్రతివానికి, ఏకువాడైనను సరే, వడుకువాడైనను సరే, నేయువాడైనను సరే, రంగు అద్దువాడైనను సరే, ఇస్త్రీ చేయువాడైనను సరే, అందరికిని తగిన ప్రతిఫలము ముట్టజెప్పినప్పుడే అది ఖద్దరగునని అఖిలభారత చరఖాసంఘమువారు నిర్వచించియున్నారు. ఇట్లు ఖద్దరు ఉత్పత్తి చేసిన

వారికి అఖిల భారత చరఖాసంఘమువారు సర్టిఫికేట్లు అనగా ధ్రువపత్రము లిచ్చు చున్నారు. అన్నిరకముల గుడ్డను ప్రజలయెదుట బెట్టి ఖద్దరని మోసగించుటకు అవకాశము కలదు. వర్తకులు వ్యాపారములో ప్రవేశించుచో కేవలము లాభములకే చూచుకొందురు గాని నీతిని వారు లెక్కచేయరు. ఇట్టి క్లిష్ట పరిస్థితుల ధ్రువపత్రము లిచ్చుభారము అఖిల భారత చరఖాసంఘముపై బడినది. ప్రభుత్వమువారి అవసరములకు కావలసిన ఖద్దరు హెచ్చుచున్నది. ఆసుపత్రులకు, పోలీసులకును, ప్రభుత్వోద్యోగియులకు ఖద్దరు కావలెనని వివిధప్రభుత్వముల వారడుగుచో ఒక్క ప్రభుత్వమునకైన సరిగా ఖద్దరు సప్లయి చేయలేని స్థితిలో అఖిల భారత చరఖా సంఘమువారున్నారు. ఇట్టి స్థితిలో సప్లయి చేయబడు ఖద్దరంతయు కల్తీలేని ఖద్దరుగా నుండునట్లు చూచుటకును, ఈపరిశ్రమలో పనిచేయు ప్రతివానికి తగిన కూలి లభించునట్లు చూచుటకును అఖిల భారత చరఖా సంఘమువారు ఆదుర్దాకలిగి యున్నారు.

జిల్లాబోర్డులు, మునిసిపాలిటీలు, కార్పొరేషనులు ఖద్దరుకుగాను ఆర్డరు లిచ్చునప్పుడు ధ్రువపత్రములు పొందని సంస్థలుగూడ అంచనాను పంపుచున్నట్లు నాకు తెలియవచ్చినది. ధ్రువపత్రములు పొందని వారినుండి అంచనాలు పుచ్చుకొనరాదనియు, అట్టివారిని ప్రోత్సహింపరాదనియు జిల్లాబోర్డుల కాంగ్రెసు అధ్యక్షులకు తెలియయును. కావున ధ్రువపత్రములు పొందనివారి నుండి ఖద్దరు కొనరాదని యిందు మూలకముగా అందరికిని విజ్ఞాపనము గావించుచున్నాను.

## ముగింపు.

ఖద్దరును ప్రశంసింప వలసిన రోజులు పోయినవి. ప్రజల హేళనమునకును విమర్శలకును, ఎగతాళికిని ఖద్దరు తాళగలిగెను, ఇప్పుడు దానిని ప్రోత్సహించి, పోషించురోజులు వచ్చినవి. బీదలయెడ ప్రజల హృదయములు ఆర్ద్రముగు రోజు లింకమీద రావలసియున్నవి. తమ వద్ద మూలుగుచున్న ధనము బీదల వినియోగార్థమని ధనికులు గ్రహింపవలసిన రోజులు యింకపైన రావలసియున్నవి. బీదలకు అన్నపానము, యిండ్లు కల్పించుట ధనికుల కర్తవ్యమని ప్రజలు గ్రహింపవలసిన రోజులు యికముందు రావలసియున్నవి. ఖద్దరు గృహముయొక్క పవిత్రతను రక్షించును. ఖదరు భార్య భర్త, పిల్లలను ఒక్కచోనుంచి వారల ప్రేమను వృద్ధిచేయును. తాను చేయు వస్తువు తనదే, దానిపై తనకు సంపూర్ణాధికారము కలదను భావము వృద్ధియగును. గృహము ఒక కార్ఖానా మాత్రమేగాదు. అది పాఠశాల గూడను. ఆపాఠశాలలలో తల్లి దండ్రి ఒడిలో కూర్చుండి పిల్లలు తర్ఫీదు పొందుచున్నారు. గృహయజమాని సర్వస్వతంత్రుడు. ఒకరియాజ్ఞల కతడు బద్ధుడుకాడు. వివాహమువచ్చిన, మరణము సంభవించిన ఒకరిని ప్రాధేయపడి, సెలవుకై యాచింపవలసిన అవసర మతనికి లేదు

భారత నాగరికతకు గృహపరిశ్రమలే మూలాధార మను వాదమును 20 వ శతాబ్దములో నెవ్వరు కాదనగలరు? తమ దేశవస్తువులను వాడవలెననియూ, అన్యదేశ వస్తువులను బహిష్కరింపవలెననియూ జపాను, ఈజిప్టు, చయినా, అరేబియా, పాలస్తీనా, సిరియా, పర్షియా, ఆఫ్గనిస్థానము, మెసపటేమియా మున్నగు దేశములవారు గగ్గోలు పెట్టుచుండ మరియు గ్రామపరిశ్రమలను వృద్ధిచేసికొనుటకు యెవ్వరు ఆటంకము చెప్పగలరు? ఈ గృహపరిశ్రమలలో ఖద్దరు ముఖ్యమైనది గావున దాని ప్రాముఖ్యత నెవ్వరు వివరించి చెప్ప బనిలేదు. ప్రతిసంవత్సరము గాంధి వర్ధంత్యుత్సవముల సమయమున ప్రజలకే విజ్ఞాపనము గావించి తమ మోక్షము తమ చేతులలోనే కలదని చెప్పుచుందుము ”

# 3 వ వ్యాసము

# మద్యపాన నిషేధము

:o:

చెరుకువాడ వెంకట నరసింహముగారు.

మద్యపానము సప్తవ్యసనములలో నొకటి. కోటాన కోట్లు పేదవారైన పాటకజనులును, కొలదిమంది ధనాఢ్యులైన నవనాగరికులును ఈ దుర్వ్యసనము నకు దాసులై తమ శీల గౌరవారోగ్య ఐశ్వర్యములను గోల్పోవుచున్నారు. పాశ్చాత్య దేశములలో మితిమీరి త్రాగుట సంఘములో కొంత హేయముగ చూడబడు చున్నను ఖరీదుగల సారాయిని పరిమితముగ త్రాగుట నాగరికులు సభ్యతగానే భావిస్తున్నారు. కాని మనదేశములో ఈ త్రాగుబోతుతనానికి సంఘములో ఏవిధమైన మర్యాదయులేదు. మనదేశములో మర్యాదస్తుడెవ్వడును బహిరంగముగా తాను పరిమితముగానైనను త్రాగుతానని చెప్పుకొనుటకు సాహసింపడు. ఆంగ్ల నాగరికతా సంపర్కము మనకు లభించినతరువాత మనదేశములోని కొందరు ఆంగ్ల విద్యాధికులగువారినిచూచి మరికొంతమంది ధనాఢ్యులును ఖరీదుగల విదేశపు సారాలను త్రాగుటకు అలవాటు పడుచున్నారు. పూర్వకాలమున మనదేశములోకూడ మద్యపాన మున్నట్లు పురాణములలో అక్కడక్కడ కొన్ని కథలు కనుపించుచున్నవి. కాని ఆకాలములోనే శుక్రాచార్యులవారు ఈ మద్యపాన నిషేధమును విధించినట్లు భాగవతములోని ఈక్రింది పద్యమువలన తెలియుచున్నది.

క॥ భూసురులాదిగ గల జను లీ
సుర సేవించిరేని ఇది మొదలుగ పా
పాసక్తి పతితు లగుదురు
చేసితి మర్యాద దీని చేకొనుడు జనుల్॥

ఈ దేశముయొక్క జనసంఖ్య 35 కోట్లు అందు 24 కోట్లు హిందువులును 8 కోట్లమంది మహమ్మదీయులును గలరు. హిందువులలో 4 కోట్లమంది అస్పృశ్యతా పిశాచగ్రస్తులైన, నిరుపేదలగు హరిజనులున్నారు. ఈ హరిజనులలో 100 కి 80, 90 మంది పురుషులు త్రాగుబోతులై నిత్యదరిద్రతలో కృశించుచున్నారు. వీరుగాక ఉప్పర్లు, ఎరుకలు, మొదలగు మరికొందరు పాటకజాతులును పాముల వాళ్లు, మందులవాళ్లు మొదలగు భిక్షుక జాతులును తమ కష్టార్జిత ద్రవ్యమునంత

త్రాగుబోతుతనముక్రింద ఖర్చుపెట్టుచున్నారు. రయితు వృత్తికి జెందిన అగ్రజాతి హిందువులలోకూడ, ప్రత్యేకంగా కొన్నికులములవారు ఈత్రాగుబోతుతనముచేత తమ వివేకమును, ఐశ్వర్యమును, ఆరోగ్యమును, మర్యాదను, కోల్పోవుచుండుట మిక్కిలి శోచనీయము.

బ్రిటిషుప్రభుత్వము వచ్చిన తరువాత మనదేశములో ఈ మద్యవిక్రియమునకులైసెన్సులనిచ్చి బాహాటముగా ఈవ్యాపారమును గవర్నమెంటువారే సాగించుచున్నారు. చాలకాలమునుండి ఈ పానవ్యాపారము ప్రభుత్వమునకు ముఖ్యాదాయమార్గములలో నొకటియైయున్నది. దొంగతనము, వ్యభిచారము, జూదము, నరహత్య మొదలగు పాపములలో చేర్చి రాజశాసనముచే నిషేధించవలసిన ఈ త్రాగుబోతు తనముపై లైసెన్సు సుంకములను వసూలుచేసి వూరూర దుకాణములు పెట్టించి కావలసినవారు యథేచ్ఛగా త్రాగవచ్చునని రాజానుజ్ఞ యొసంగు టెంతయు లజ్జాకరము. సంఘ విద్రోహకరములగు నైన వివరించిన జారచోరత్వాది దుష్కార్యములకు ప్రభుత్వము లైసెన్సునిచ్చుట ఎంత అధర్మమో మద్యవిక్రయమునకు లైసెన్సునిచ్చుటకూడ అంతే అధర్మము. కాని మన కిప్పుడు పరిపాలికులుగానున్న పాశ్చాత్యుల దృష్టిలో జూదపానము లంత హేయములు కాకపోవుటచే వానివిషయములో వారు కొంత సాదరభావము కనబరుస్తున్నారు. అనేకమంది మహమ్మదీయ మతగురువులుకూడ ఈమద్యపానమును ఎంతో తీవ్రముగా ఖండించి నిషేధించినను హిందువులలోవలెనే మహమ్మదీయ సోదరులలోగూడ ఈ దురాచారము ప్రబలియుండుట మిక్కిలి విచారకరము. యీదురాచారమును నిర్మూలించుటకు జాతి, మత, కుల వివక్షతలు లేకుండా దేశ శ్రేయోభిలాషులందరును దీక్షతో పనిచేయవలసియున్నది.

బ్రిటిషు యిండియా మొత్తమున సంవత్సరమునకు ఈత్రాగుడు వ్యాపారము వల్ల సాలీనా షుమారు 17 కోట్ల రూపాయిలు గవర్నమెంటునకు వస్తుంది. మన మద్రాసు గవర్నమెంటుయొక్క సంవత్సరపు ఆదాయము 16 కోట్ల రూపాయలు. అందులో 4 కోట్లరూపాయిలు కేవలము ఈ ఆబ్కారీ పన్నుమూలంగా లభిస్తున్నది.

దేశములోని పేదవారు వారి భార్యాబిడ్డలు అన్నవస్త్రములకు మొగము వాచి హాలో లక్ష్మణా అని నిరంతర దుఃఖములో కుళ్లిపోతుండగా వారి త్రాగుబోతుతనము మూలంగా లభించిన యీపాప ద్రవ్యముతో ధనాఢ్యుల బిడ్డల విద్యాప్రదానమునకు ప్రభుత్వమువారు వినియోగించు చున్నామని చెప్పుచున్నారు. ఇంతకంటె కాపులను చంపి గద్దలకువేసే పుణ్యకార్యమేమున్నది.

మంచి ప్రజ్ఞావంతులైన పనివాండ్రు యెందరో ఈ త్రాగుబోతుతనమునకు గురియై సకుటుంబముగ నిత్యదరిద్రము ననుభవించు చున్నారు. త్రాగుబోతుల హస్తకౌశలము నానాటికి క్షీణించిపోవును. వారిగుండెలు, రక్తము విషపూరితములై అనేక దుర్వ్యాధులు యెక్కువ తేలికగా వారి నాశించు చుండును. వ్యాధి

ఎదిరించగల శరీరపాటవము క్షీణించి అనేకమంది త్రాగుబోతులు, అకాల మృత్యువాత బడుచున్నారు. త్రాగుబోతు వివేకహీనుడై వ్యభిచారము, దొంగతనము, నరహత్య మొదలగు పాపము లన్నిటికి తేలికగా పాల్పడుచున్నాడు. దేశములో త్రాగుబోతుతనమును నిర్మూలించినయెడల పాటక జనుల దారిద్ర్యము సగమువంతు తీరిపోవును. వారి ఆరోగ్యము విద్య అభివృద్ధియగును. దేశములో నేరములు, న్యాయవిచారణలు శిక్షలు చాలవరకు తగ్గిపోవును. అందుచే ప్రభుత్వ వ్యయముకూడ చాలవరకు తగ్గిపోవును. దేశములోని వర్తక వ్యాపారములు, వస్తునిర్మాణములు శక్తి ప్రావీణ్యములు చాల వృద్ధియగును. దేశ జన క్షేమదాయకమైన ఈమద్యపాన నిషేధప్రచారము కాంగ్రెసు యాజమాన్యమున గాంధీ మహాత్ముడు గడచిన 17 సంవత్సరములనుండి దేశములో తీవ్రముగా సాగించుచున్నాడు. మనరాజధానిలో కాంగ్రెసువారు రాజ్యాధికారమునకు వచ్చినతరువాత, ఇదివరకు తాము బయటనుండి ప్రబోధించిన ఈధర్మమును నిర్వర్తించుటకు ఇప్పుడు పూనుకొనియున్నారు. ఒక్కమారుగ రాష్ట్రమంతటను మద్యపాన నిషేధమును సాగించినయెడల గవర్నమెంటుకు 4 కోట్ల రూపాయల ఆదాయము హటాత్తుగా తగ్గిపోయి ప్రభుత్వరథము సాగుటకు అభ్యంతరము గలుగును. కావున కాంగ్రెసు మంత్రివర్గమువారు ప్రస్తుతము ఒక సేలము జిల్లాలో మాత్రము ఈయేడు ఈమద్య విక్రయ నిషేధమును ప్రారంభించారు. తక్కిన జిల్లాలలోగూడ క్రమక్రమంగా 2. 3 ఏండ్లలో ఈ ఏర్పాటు పూర్తిగావించ నెంచుచున్నారు. దీనిమూలమున తగ్గిపోయే ప్రభుత్వాదాయమును పరిపెట్టుటకు క్రొత్తవరుమానముల నాలోచించుటకును అనవసరమైన పాతవ్యయముల తగ్గించుటకును ఆలోచించుచున్నారు. కావున ఇతరజిల్లాలలో ఇప్పటినుండి ఈవిషయమై తగినంత ప్రబోధము గావించి ప్రజాభిప్రాయమును ఇందుకు సుముఖముగా చేయుట మన కర్తవ్యమని ఈ గాంధి జన్మదిన సప్తాహమహోత్సవ సందర్భములో తమకిందుమూలముగ జ్ఞాపకము చేయుచున్నాము.

మద్యపాన నిషేధమునుగూర్చి గవర్నమెంటువారే ప్రయత్నము చేయుంచున్నప్పుడు మనకు అనుకోనే అభ్యంతరాలు ఏమీ రావనుటకు అనేక నిదర్శనములు గలవు. బహిరంగంగా త్రాగుటను మాన్పిస్తే రహస్యంగా సారా చేసి త్రాగుతారన్నమాట మనము వింటాము. కాని మానవ స్వభావమును మనము సరిగా తెలిసికొన్నట్లయితే ఇట్టివూహ మనస్సులలో పుట్టదు. మనిషి స్వతహా మంచివాడే. కాని చుట్టూవుండే పరిస్థితులు యితన్ని పాడుచేస్తాయి. గవర్నమెంటు యెంతమాత్రమైన త్రాగుడు పనికిరాదని నిషేధమును, ఏవగింపును చూపినయెడల రెండు మూడు సంవత్సరములలోనే ఇది నిర్మూలమవుతుందని చెప్పుటకు సందేహము లేదు. బంగాళా గవర్నమెంటువారు వారి 37-38 సం|| బడటులో ఈవిధంగా చెప్పినారు. ప్రజలయొక్క మంచి అభ్యాసములవల్లను, గుణములవల్లను, బంగాళా రాష్ట్రములో త్రాగుడువల్ల వచ్చే ఆదాయము ఇండియాలోకెల్ల చాల తక్కువగాయున్నది. ఇతర రాష్ట్రములలో బంగాళాలోకన్న మనిషి 1 కి 5 రెట్లు

ఆదాయము వచ్చేది. ఒకటిన్నీ 4 రెట్లు ఎక్కువ ఆదాయమూ వచ్చేది ఒకటిన్ని వున్నవి. దక్షిణ ఇండియావారుగాని, బీహారు వాస్తవ్యులుగాని, గుజరాతీయులుగాని బంగాళావారికంటె నీతిలో, ప్రవర్తనలలో చెడిపోయినవారుగారు అయినప్పటికిని బంగాళాలో అవలంబింపబడిన ప్రజాపరిపాలనయొక్క నీతిని బట్టిన్ని త్రాగుడు విషయమున గవర్నమెంటుచే చూపబడు అసహ్యతను బట్టిన్ని అక్కడ త్రాగుడువల్ల వచ్చే ఆదాయము చాల తగ్గిపోయింది.

న్యూయార్కు పట్టణములో ఒక ఆసుపత్రిలో 246 రోగులను వారు ఎందుకు త్రాగుచుండిరని విచారించగా, సహవాసదోషమువల్ల 52.5%, సంసార చిక్కుల వల్ల 130%, వైద్యరీత్యా 8.8%, వృత్తిరీత్యా 7%, పెద్దవాళ్ల వత్తిడివల్ల 7%, పని లేక పోవుటవల్ల 5%, షోకు కొరకు 12%, తెలియని కారణాలచే 5%, ఈవిధంగా తేలిన అంకెలనుబట్టి చాలవరకు కేవలము సహవాస దోషమే ఈవిపత్తుకు కారణమని తేలుచున్నది. గృహసంబంధమైనట్టి భార్యాభర్తల మధ్య విడాకులు త్రాగుడువల్లనే ఎక్కువగా వస్తూంటవి. 1887 మొదలుకొని 1906 మధ్యను అమెరికాలో 1,84,568 వివాహములు విడాకులతో అంత్యమైనవి. కేవలము త్రాగుడే దానికి కారణము. నూటికి 45 చొప్పున సంసార వైమనస్యమును త్రాగుడువల్ల పొందుచున్నట్లు రుజువగుచున్నది. స్త్రీలు వ్యభిచారము మొదలు పెట్టి పట్టణములలో వ్యభిచారనిలయములలో ప్రవేశించునప్పుడు 2 వేల మంది స్త్రీలయొక్క వృత్తాంతమును పరిశీలిస్తే 100 కి 80 చొప్పున త్రాగుడుకు అలవడి వారని తెలుస్తోంది మనదేశముయొక్క దరిద్రతను చూడగా త్రాగుడుమీద ఖర్చు పెట్టే సొమ్ము ఆశ్చర్యముగ కనుపిస్తుంది. సరిహద్దురాష్ట్రములలో దామాషాయాని ఖర్చు మనిషికి రూ 0-3-8 బొంబాయిలో రూ 2-1-0 తక్కిన రాష్ట్రములలో ఈరెండంకెలలో మధ్యను వున్నది.

త్రాగుడువల్ల 6 రోజులు పనిచేసి 7 వ రోజు (ఆదివారము) నాడు సెలవు రోజున పనిచేయని దేశములలో ఆదివారమునాడు త్రాగడముచేత శనివారము నాటిపనికిని సోమవారమునాటిపనికిని, తారతమ్యము చూస్తే శనివారమునాడు తుపాకీ గురికి 100 కి 80 తప్పకుండా కొడితే సోమవారమునాడు 100 కి 70 కొడతాడు. శనివారమునాడు గంటకి ఒక పేజీ అచ్చుకూర్చ గలిగితే సోమవారమునాడు 3-వ వంతు పేజీని కూర్చగలడు. శనివారమునాడు 10 అడుగులదూరము దూకగలిగితే సోమవారమునాడు 9 అడుగులు దూకగలడు. ఈ ప్రకారంగా సోమవారముకంటె మంగళవారము; మంగళవారముకంటె బుధవారము, బుధవారముకంటె గురువారము పని ఎక్కువ చేయగలిగి గురువారము మొదలుకొని శనివారమునకు మామూలు పనిలోనికి రాగలడు. మళ్లీ ఆదివారము త్రాగుడు చేత సోమవారము పనిచేసియున్న చక్రము గిర్రున తిరుగును.

కాబట్టి ఈ మద్యపాన నిర్మూలనమును దేశమున ఉత్సాహవంతముగా చేయవలసియున్నది.

# 4 వ వ్యాసము.
# అస్పృశ్యతా నివారణము.

:o:

## మహాత్ముని నిర్మాణ కార్యక్రమ ప్రాముఖ్యము.

## ఆర్థికముగ హరిజనుల నుద్ధరింపవలసిన అవసరము.

[ డాక్టరు పట్టాభి సీతారామయ్యగారు. ]

### ఉపోద్ఘాతము.

మన దేశములోయున్న 24 కోట్లమంది హిందువులలో 4 కోట్లమంది హరిజనులు గలరు. వారందరు మాల, మాదిగ, మాష్టీక, దాసరి, రెల్లి, చప్పర, పాకీ, యానాది మొదలైన పేర్లతో మన ఆంధ్రదేశమందు వ్యవహరింపబడుచున్నారు. ఈ దేశములోనున్న 1,50,000 గ్రామములలోను దాదాపుగా ప్రతిగ్రామమును ఆశ్రయించి ఒకటి రెండు హరిజన వాటికలున్నవి. ఇవి పల్లెలు అని పిలువబడుచున్నవి. ఈ హరిజనులు ఎంతో కాలమునుండి మన దేశములో అంటరానివారనియు, అంటరానివారు, చెప్పరానివారు అనియు పిలువబడుచు పక్షులు గాడిదలు మొదలైన నీచమృగములకంటె నీచముగా చూడబడుచుండుట ఎంతయు శోచనీయము. ఈ అస్పృశ్యతానివారణమునుగూర్చి ఇప్పటికి షుమారు 100 సం॥ క్రిందట రాజా రామమోహన రాయలవారి హయామునుండి ప్రయత్నములు ప్రారంభమయ్యెను, కాని కాంగ్రెసు మహాసభ గాంధీమహాత్ముని నాయకత్వముక్రిందికి వచ్చినప్పటి నుండి ఈవిషయమై ఆశ్చర్యకరమైన ప్రబోధము, పరిణామము జరుగుచుండుట మిక్కిలి సంతోషదాయకము. మానవుని బుద్ధి ఎప్పుడును క్రొత్త ఆచారమును ఎదిరించుచు ప్రాత ఆచారమునకు దాస్యము చేయుచుండును. అభ్యాసవశము చేతనే కొందరికి హేయముగా తోచినవిషయము మరికొందరికి అన్యాయముగా నుండును. ఒక కాలములో, ఒక స్థలములో, ఒక సంఘములో, ఒక సందర్భములో పరమాదరణీయమైన విషయము. మరియొక కాలములో, మరియొక స్థలములో మరియొక సంఘములో, మరియొక సందర్భములో పరమ గర్హ్యాహముగా నెంచ

బడుచుండును. అందుచేత వస్తుతః ఒక విషయములోని గుణదోషములను యిద మిత్థమని నిరూపించుట అసాధ్యము. మానవ సంఘములోని పరివర్తనలో, ఆచార వ్యవహార, కర్మకాండలన్నియు దేశకాల పాత్రానుగుణ్యముగా సమన్వయించు కొనుటయే సంఘ శ్రేయోభిలాషుల కర్తవ్యము. బహుజన శ్రేయోదాయకమైన శాస్త్రాన్వయములును తత్వనిరూపణములును మాత్రమే ధర్మశాస్త్రము లనబడును.

ఆనాదికాలమునుండి ఈ అంటుదోషము హిందూసంఘములో నున్నది. కనుక దానిని తీసివేయరాదని కొందరివాదము. ఇది మిక్కిలి దుర్బలవాదము. చిరకాలమునుండి చేసిన పాప మెప్పుడును ఆ కారణముచేతనే పుణ్యముగా మారి పోనేరదు.

మహనీయులైన మన పూర్వపు పెద్దలు నిర్మించిన ఈ యాచారమును మాన్పుటకు మన మెంతవారము? వారికంటె మనమధికులమా అని యింకొక వాదన. ఇదియును దుర్బలవాదమే. మన పూర్వులనాటి ఆచార వ్యవహార వృత్తుల సంప్రదాయము లన్నిటిని మన ప్రస్తుత సౌఖ్య సౌకర్యములకై ఎట్లు మార్చుకొనుచున్నామో అట్లే దీనిం గూడ మార్పవచ్చును.

## చండాలోత్పత్తి

సనాతనవాదులు ఈ చండాలోత్పత్తినిగూర్చి ఈ క్రింది మొదటి కారణమును చెప్పుచున్నారు :—

1. ధర్మశాస్త్రములందు చండాలురని ఒకజాతి చెప్పబడియున్నదనియు, వారు బ్రాహ్మణ స్త్రీకి శూద్రపురుష సంపర్కమువల్ల జన్మించినవారును, ఇతర సత్కర్మభ్రష్టులును, మరికొందరు దుష్కర్మశీలురును, ఈ చండాల జాతిలో చేరినవారనియు, వారికి ఊరివెలుపల నివాసము, అంటుదోషము, శాస్త్రవిహితము లనియు చెప్పుచున్నారు. ఆ శాస్త్రములందే చండాలజాతిని గుర్తించుటకు 6 లక్షణములు చెప్పియున్నారు. వారికి 1. ఊరివెలుపల నివాసము, 2, ఇనుము ఆభరణములుగా ధరించుట, 3. పగిలిపోయిన బొచ్చెలలో భుజించుట, 4. గాడిదలను, కుక్కలను ఆస్తిగా పెంచుట, 5. ఊరూర సంచారము చేయుట, 6. శవములమీద కప్పిన గుడ్డలను తీసుకొనుట ముఖ్యధర్మములు. ఈ ఆరు లక్షణములలో 1-వ 6-వ లక్షణములు మాత్రమే యిప్పుడు మన దేశములో నున్న హరిజనులకు వర్తించుచున్నవి. అంతమాత్రముచేతనే వారిని శాస్త్రములో చెప్పబడిన చండాలురనరాదు. అట్లయినచో పైన చెప్పబడిన 1,5 లక్షణములు విహితములైయున్న స్వాములవారలు పీఠాధిపతులు కూడ ఈవర్గములో చేరవలసియుండును. శవములను సంబంధించిన అనేక యితరవస్తువులను దానము పట్టే పురోహితులుగూడ

ఈ వర్గములో చేరవలసియుండును. కావున శాస్త్రములో నిర్వచింపబడిన ఛండాలుడు మన హరిజనుడు కాజాలడు. అందుచే శాస్త్రరీత్యాకూడ మన హరిజనులను అంటుదోష మూడరాదు. ఒకవేళ సనాతనులకు ఛండాలోత్పత్తి కారణమునే అంగీకరించినను ఈనాడు బ్రాహ్మణస్త్రీ శూద్రపురుషులకు కలిగిన సంతానము అస్పృశ్యత లేకుండా ఏనాడో ఎన్నివేలతరముల క్రిందటనో సంభవించినదని నమ్మి ఆ నేరమునకు శాశ్వతముగ తరతరములకును శిక్షవేయుట అన్యాయము కాదా?

2. ఇంగ్లీషు విద్యావంతులైన హిందూదేశ చారిత్రకారులు ఈచండాలోత్పత్తికి చెప్పు కారణ మేమంటే పూర్వకాలమందు ఆదిమనివాసులైన ఈదేశపు అనార్యజాతిని, ఈదేశమునకు వలసవచ్చిన ఆర్యజాతివారు ఓడించి ఓడినవారికి గెలిచినవాడు ఈ అంటుదోషమును, ఊరిబయలు నివాసమును, శిక్షగా విధించెనని చెప్పుచున్నారు. చండాలోత్పత్తికి ఇదియే కారణమని అంగీకరించేవారు కూడ ఎన్నడో ఏర్పడిన ఆర్య, అనార్య వైరకారణమును నేటికిని మనము అమలు జరుపుట న్యాయముకాదని ఒప్పుకోక తప్పదు.

3. ఈచండాలోత్పత్తిని గురించి మరికొందరి సమాధాన మేమంటే, ఈ దేశానికి వలసవచ్చిన ఆర్యజాతివారు బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్రులని తమలో చాతుర్వర్ణవిభాగమును గావించుకొని అనార్యులైన ఈదేశపు ఆదిమనివాసులతో పోట్లాడి జయించి లోబరచుకొని వారిని గుణకర్మ విభాగముచే తమ చాతుర్వర్ణములలో చేర్చుకొని ఆర్యధర్మప్రచారము గావించిరనియు, అప్రకారము కొంతకాలము అనార్యజాతివారు కొందరు ఆర్యజాతి సంపర్కమును పొందిరనియు నేడు దేశములోనున్న చాతుర్వర్ణ హిందువులును, పైనచెప్పిన సాంకర్యమువలన యేర్పడినదే యనియు, ఆర్యధర్మ స్వీకారము పొందకుండ మిగిలిపోయిన అనార్య సంఘమువారిని పంచములని చెప్పుచు హేయముగ జూచుటచే ఈఅంటుదోషములు వారిచే మారినవని చెప్పుచున్నారు ఇదియే అన్నిటికంటె ఎక్కువ సముచితమైన కారణముగ కాన్పించుచున్నది. దీని నంగీకరించువారు గూడ పూర్వము మన ఋషులు ప్రారంభించిన ఆర్యధర్మప్రచార శేషమును నేడు గాంధిమహాత్ముడు పూర్తిచేయుచున్నట్లు విశ్వసించు చున్నారు.

అస్పృశ్యతను నివారింపవలెనను భావము క్రొత్తదిగాదు. కాని రాజకీయ కార్యక్రమములో, నిర్మాణ కార్యక్రమమునందలి మూడు విభాగములలో అస్పృశ్యతా నివారణను చేర్చుట క్రొత్తవిషయము గాంధిమహాత్ముని నిర్మాణకార్యక్రమమునందు ఒక్క ఖద్దరుతప్ప క్రొత్తగా కనిపెట్టిన విషయమేమియు లేదని చెప్పవచ్చును. ఆర్థికాభివృద్ధికై యొక కార్యక్రమము, సాంఘికాభివృద్ధికై

మరియొక కార్యక్రమమును, నైతికాభివృద్ధికై మరియొక కార్యక్రమమును మేళవించి ప్రజలలో వ్యాపింపజేయుట ఈయుగ లక్షణమైయున్నది. దేశములో నత్యంత శీఘ్రగమనమున ప్రచారము చేయుతరి గాంధిమహాత్ముడు ఆపన్నులను సహాయము చేయ ప్రయత్నించియున్నాడు. ఒక్కొక్కరి కష్టములు ఒక్కొక్క విధముగా నుండెను ఒకప్రదేశమున పతితస్త్రీలు పవిత్రలగుటకు మహాత్ముని కటాక్షవీక్షణములకై వేచియుండిరి మరియొకచోట ననేకకష్టముల నందుచున్న అస్పృశ్యులు మహాత్మునిసాయము నపేక్షించిరి. మరియొకచోట మద్యపానముచే నిల్లు, వళ్లు గుల్లచేసుకొనినవాని భార్యాపుత్రులును, మరియొకచో నిలువనీడయు, తిననన్నమును లేని అనాథలును మహాత్ముని శరణుజొచ్చిరి ఎల్లెడ దుఃఖము వ్యాపించియుండుటవలన మహాత్ముడు నిరాశ జెందలేదు. విధ్యుక్తము నతడు వీడి, తాను చేయదగిన కర్మను విడనాడి, అడవులలో తపము చేసికొనుట కాయన వెళ్లలేదు. ఉత్తమ మానవ ధర్మమును మహాత్ముడు చేపట్టి, ధైర్యమవలంబించి ఆయన పతితుల యొక్కయు, ఆపన్నుల యొక్కయు, అభాగినుల యొక్కయు అనాథలయొక్కయు సేనకై పూనుకొనెను. భారతీయులను పీల్చి పిప్పిచేయుచున్న బాధలను మాన్పుటెట్లాయని మహాత్ముడు విచారించెను. ఆయన విచారణకు ఫలితముగా నిర్మాణకార్యక్రమము యేర్పరుపబడెను అస్పృశ్యతా నివారణమున కిదియే మూలము.

## మహాత్మునికి పూర్వము సంస్కర్తలు.

ఒక శతాబ్దమునకు క్రిందట రాజా రామ మోహనరాయలు యిందుకై తన యపరిమితములగు శక్తి సామర్థ్యములను ధారబోసెను. ఆయన సిద్ధాంతములను బ్రహ్మసమాజమువందలి ఆతని యనుచరులు అవలంబించియున్నారు. బ్రహ్మసామాజికులు హరిజన బాలబాలికలను పెక్కుర నుద్ధరించి, సత్పౌరులనుగా నొనరించియుండిరి. రాజా రామమోహన రాయలకు పూర్వము రామానుజాచార్యులు మున్నగు మతగురువులు అస్పృశ్యతా నిర్మూలనము గావించుట కెంతయోని ప్రయత్నించిరి. కావున ఈమహాశయుల పనివలన నుత్సాహము, ధైర్యము తెచ్చికొనినవాడై మహాత్ముడు మన సాంఘిక, రాజకీయ కార్యక్రమమును ప్రారంభించెను. తన కార్యక్రమములో మహాత్ముడు అస్పృశ్యుల ఆర్థిక అభివృద్ధికి ప్రధాన స్థాన మొసంగెను. ఈ అస్పృశ్యులకు మహాత్ముడు హరిజనులను నామకరణ మొసంగెను.

## హరిజనులకు జరుగుచున్న సహాయము.

గాంధిమహాత్ముడు అస్పృశ్యతా నివారణోద్యమమును ప్రారంభించినది లగాయతు దేశమందంతట నూతనోత్సాహము కలిగినది. హరిజనుల కెంత ప్రయో

జనము కలిగినది అను విషయమునకు మన మంత ప్రాధాన్యమొసంగరాదు. కాం గ్రెసువారి నూతనకార్య క్రమ ఫలితముగా హిమాలయపర్వతములనుండి కన్యాకుమారివరకు వ్యాపించిన నూతనోత్సాహము, నూతన దృక్పథము గమనింపదగియున్నది. హరిజనుల యభివృద్ధికి తోడ్పడవలెనను ఆసక్తి ప్రజలకు కలిగినది. ఉన్నత పాఠశాలలలో చదువు బాలురకు విద్యార్థివేతనము లొసంగబడినవి. చెప్పులు కుట్టుట, బట్టలుకుట్టుట, చాపలల్లుట, వడ్రంగము, పేముఅల్లకము, వైద్యము మున్నగు వృత్తి విద్యలు నేర్పుట. బావులలోను, తటాకములలోను హరిజనులు నీరు తోడుకొనుట కనుమతించుట, హరిజనులకు క్రొత్త బావులు, పాఠశాలలు కట్టించుట, ఇదివరకున్నవానిలోనికి వారికి ప్రవేశమొసంగుట మున్నగువాని మనము గమనింపనగును. గాంధిమహాత్ముడు స్థాపించిన హరి జనసేవక సంఘము వారు పైన పేర్కొనినవానినిమాత్రమేగాక యింక అనేక పనులనుగూడ హరిజనుల అభివృద్ధికై చేయుచున్నారు.

## తొలగింపబడిన కష్టములు.

హరిజనులకు గల అనేక కష్టములను తొలగించుటకుగూడ సంఘమువారు ప్రయత్నించుచున్నారు. కొన్ని ఉదాహరణ లిచ్చుట సమంజసము. గార్వాల్ జిల్లాలలో హరిజనులు వివాహ సమయములలో డోలీలలోను, పల్లకులలోను ఊరేగరాదు. ఇట్టి ఊరేగు హక్కును హరిజనులు అలహాబాదు హైకోర్టులో స్థాపించుకొనిరి. మధ్యరాష్ట్రములలో వీథులనూడ్చువారు బస్సులలో ప్రయాణము చేయుటకు బస్సుడ్రైవరు లంగీకరింపకుండిరి. హాజాపూరు వీథులూడ్చువారు ఈ హక్కును స్థాపించుకొనగలిగిరి.

## మహాత్ముని నిరశనవ్రతము.

నేడు రాజకీయములలో పాల్గొను పురుషులు అవతారము చాలించినతరువాత గూడ నేడు రాజకీయములుగానున్న విషయములు రేపు చరిత్రగా మారిన తరువాతకూడ, అస్పృశ్యత రూపుమాసి, భారతదేశ ప్రజలలో 5 భాగము ప్రజలు, యితర హిందువులలో కలసిపోయిన తరువాతగూడ మరువబడజాలనిది ఒక్కటి గలదు. అది మహాత్ముని చరిత్రాత్మకమగు నిరశనదీక్ష. స్వాతంత్ర్యమునకై భారతదేశము చేయుచున్న పోరాటమునంతను మార్చినవిషయమిది. భగవంతునిచే నొక్కసంఘముగా సృష్టింపబడిన హిందూసంఘములో మెజారిటీ యను సవర్ణులకును, మైనారిటీయను అవర్ణులకును కృత్రిమ విభేదములు కల్పించి, చీలదీయుటకు అసమ్మతి దెలుపుటకుగాను సెప్టెంబరు 20 తారీఖున గాంధిమహాత్ముడు ప్రారంభించిన నిరశనవ్రతము అనేక శతాబ్దములవరకును భారతీయులకు మరపునకురాదు,

భారతీయులలో విభేదములు కల్పించి పరిపాలించుట ఆంగ్లేయుల రాజనీతియై యున్నది. హరిజనులను హిందువులనుండి ప్రత్యేకించి రాజకీయముగా నొక పార్టీ లేక గ్రూపుగా చేయుట పాలకుల అభిమతమై యుండెను. ఆంగ్లేయుల రాజనీతివలన మొదట మహమ్మదీయులకును హిందువులకును విభేదము లేర్పడెను. తరువాత హిందువులకు సిక్కులకు విభేదములు కల్పింప నుద్దేశింపబడెను. పాలకుల ఈ కృత్రిమచేష్ట మహాత్మునికి అసహ్యమయ్యెను. ఆ పాపమస్తకము ఆయన చలించిపోయెను. హరిజనులను హిందువులనుండి వేరుజేయుట కాయన యెన్నటికిని అంగీకరింపజాలకపోయెను. మహాత్ముడు చెప్పిన ఈ క్రింది మాటలు యెల్లప్పుడు భారతీయుల కర్ణపుటములయందు మ్రోగుచునే యుండును.

“సిక్కులు యెల్లప్పుడును సిక్కులుగానే యుండవచ్చును. ఈవిధముగానే మహమ్మదీయు లెల్లప్పుడు మహమ్మదీయులుగా నుండవచ్చును. అస్పృశ్యత యెల్ల కాలము నుండుటకంటె హిందూమతము నాశమొందుటయే మేలని నేను తలతును. ప్రసిద్ధిగాంచిన రెండవ రౌండుటేబిలు ఉపన్యాసమునందు మరియొకచోట మహాత్ము డిట్లు చెప్పెను.

“భారతదేశ స్వాతంత్ర్యము కొరకుగూడ హరిజనుల క్షేమమును నేను వదలను”

ఉద్యమమునందును, హిందూసంఘమునందును, మానవస్వభావమునందును, అధికారులయందును విశ్వాసము కలిగి మహాత్ముడు ఈచరిత్రాత్మకమగు నిరశనవ్రతమునకు బూనుకొనెను. ఇంత పవిత్రోద్దేశ్యముతో ప్రారంభింపబడిన నిరశన దీక్షకు ఫలితము కలుగకుండునా? మహాత్ముని సంకల్ప బలముచే హరిజనోద్యమమునందు కలిగిన అభివృద్ధి 1938 సం॥ తో అంతమగు హరిజన సేవాసంఘ నివేదికవలన తెలియుగలదు. భారతదేశమునందలి రాష్ట్రములన్నిటిలోను ఆసంవత్సరమున 4 లక్షల రూపాయలు హరిజనాభివృద్ధికై వెచ్చింపబడెను. అందులో 1,08,000 రూపాయలు మన రాజధానిలో వెచ్చింపబడెను, భారతదేశమునందు 27 రాష్ట్రీయ హరిజనసేవక సంఘములు 200 జిల్లా సంఘములుండెను.

ఎక్కడజూచిన హరిజనసభలే. ఎక్కడజూచిన హరిజనుల భజనలు, రామకీర్తనలు, మతవిద్యలే. ఎక్కడజూచిన హరిజనుల యభివృద్ధికి ప్రయత్నములే. ఎక్కడజూచిన హరిజన క్షేమములకు చేయబడు పనులే జరుగుట మనము చూచుచున్నాము. మహాత్ముడు నిర్వహించుచుండిన సబర్మతీ సత్యాగ్రహాశ్రమమును హరిజనోద్యమమునకై యిచ్చుటవలన ఉద్యమమునకు నూతన బలము ఉత్సాహము చేకూరినది. ఈప్రపంచములో తనదియని గాంధీమహాత్ముడు చెప్పుకొనదగినది.

ఈ సబర్మతీ ఆశ్రమముకంటె మరేదియూ లేకుండెను. ఇప్పుడదియూ ఆయనకు లేక పోయినది. క్రీస్తుమతాచార్యుడగు ఏసుదేవుని విషయములో చెప్పబడినట్లు పక్షులకు విశ్రమించ కులాయములు కలవు. పశువులకు కొట్టములు కలవు. కాని ఏసునకు తలదాచుకొన తావులేదాయె. అను సూక్తి నిజమైనది.

సబర్మతీ ఆశ్రమము హరిజనాశ్రమముగా మార్చుటవలన కలిగిన ఉత్సాహము సర్వత్ర గానవగును. ఇటీవల నేను కథియవాడ్ వెళ్లియుండినప్పుడు మోర్వీయను సంస్థానములో నొక హరిజనవాడకు బోతిని. ఆహరిజనవాడ మన దేశమునందలి బ్రాహ్మణాగ్రహారమును మించియుండుట నాకెంతయు ఆనందజనకమయ్యెను. భావనగరులో నొకచక్కని హరిజన వసతిగృహమును, తోళ్లను సునుపుచేయు సంస్థయు నుండెను, పోరుబందరులో నొక చక్కని హరిజన పాఠశాల కలదు. ప్రతిచోట హరిజన సంస్థలవారు ప్రేక్షకులను లోనికి దీసికొనిపోయి తాము చేసినపనిని వారికిచూపి గర్వించుచున్నారు. నూతన నాగరికతకిది చిహ్నముగాను- నూతన విజ్ఞానమునకిది చిహ్నముగాను- నూతన జాతీయ వికాసమునకు సూచనగాను, ఇన్నాళ్లనుండి చేసిన పాపములకు పశ్చాత్తాపముగాను యివి తలపబడుచున్నవి.

ప్రస్తుతము దేశము నావరించినసమస్య ఆర్థిక సమస్యయే. ఇకముందుగూడ సమస్యలు కేవలము సంఘ సంస్కరణమునకును, మతవిశ్వాసములకును మాత్రమే సంబంధించినవిగా నుండవు. ఆంధ్రదేశమునందలి హరిజనులు భూస్వాముల పొలములలో చాకిరిచేయువారుగా నున్నారు. తమ యజమానుని నేలదున్ని, విత్తనములు చల్లి, కోసి, యజమానుని పంటయజమానునికొప్పజెప్పి వారు కూలిడబ్బులు తాము తీసికొందురు. వారికష్టములు అనంతములు. వారికి కడుపునిండ తినుటకు అన్నము లేదు. వారితో దూరమునుండి మాట్లాడుదురుగాని దగ్గరకువెళ్లి మాట్లాడరు. కొట్టినప్పుడు తప్ప వారిని స్పృశింపరు. వారికి భూములులేవు. సహకారపతిసంఘ పద్ధతిమీద వీరికి భూములిచ్చుట మొదటిపనిగా నుండవలెను. కొంతభూమి పరపతిసంఘముక్రింద నుండవలెను. పరపతిసంఘమునుండి హరిజనులు కవులుకు పుచ్చుకొని సాగు చేసికొనవలెను.

కృష్ణాజిల్లాకు యిట్టిస్కీమును 1921 సం|| లో మేము సూచించితిమి కాని అప్పుడు మంత్రులుగానుండినవారు దానిని విచారింపక పోయిరి. ప్రభుత్వమువారు యిదివరకు హరిజనులకు కొంత భూమిని యిచ్చియుండిరి. కాని ఆభూమి యిప్పుడు వారిచేతులనుండి పోయినది. ఇదివరకు ప్రభుత్వము వహించినవారు యేమియు చేయకూరకుండిరి. ఇప్పుడు దేశములో తలకు అరఎకరము చొప్పున మాత్రము భూమికలదు. దానిలో పండినది ప్రజలకుచాలదు గ్రామములలో హరిజనుల యొక్క

బానిసప్రాయుడుగానున్నాడు. అతడు అనేక యిబ్బందులకు గురియగుచున్నాడు జనాభా యభివృద్ధియగుచున్నను పామరప్రజలు తాత ముత్తాతలనాటి గుడిసెలలో నివసించుచున్నారు. కాని వానిని యభివృద్ధిచేసికొనియుండలేదు. కావున హరిజన పల్లెలను విస్తరింపజేయవలెను. వీలయినచోట్ల హరిజనులకు సవర్ణులమధ్య యిల్లుకట్టుకొన నివ్వవలెను. ప్రత్యేకపాఠశాలలు, ప్రత్యేకబావులు, తటాకములు ప్రత్యేక నియోజకవర్గములు యెంతో అనర్థదాయకములో ప్రత్యేకపల్లెలుగూడ అట్లే అనర్థదాయకములు. సవర్ణులకు ప్రత్యేక పల్లెలును. అస్పృశ్యులకు ప్రత్యేకపల్లెలు నుంచుటవలన అస్పృశ్యత హిందూసంఘములో రూఢమగుచున్నది. ఈ హరిజనులు ఆర్థికముగా పడు యిబ్బందులు ఆ పరమాత్మునికే యెరుక. వీరందరును ఏకమై తమస్థితిని అభివృద్ధి పఱచుకొనవలెను.

ఏకమగుటవలన హరిజనులకు నష్టమేమి? తొలగుశ్రేయమేమి? ఏమి యూలేదు. వారేకమగుచో వారి శృంఖలములు తెగి వారికి అభివృద్ధి కలుగును. వారికి ఆకలిబాధ కలిగినప్పుడెల్ల వారు దొంగతనములు, దోపిడులుచేసి కడుపు నింపుకొన జూచుచున్నారు.

కావున హరిజనులను స్పృశించుటవలన మన పని పూర్తియైనట్లు [illegible]. వారిని మన కుటుంబములలోని వారినిగా తలచి వారి ఆర్థికస్థితిని బాగుచేయవలెను. వారిని మనము సోదరులుగా చూడవలెను. అప్పుడు వారికి అభివృద్ధి కలుగును. హరిజనులను దేవాలయములలోనికి రానిచ్చుట గొప్ప సంస్కరణమే. తిరువాన్కూరు మహారాజాగారును, లాఠీ మహారాజాగారును హరిజనులకు దేవాలయ ప్రవేశము కల్పించు ప్రకటనలను గావించుట అత్యంత సంతోషప్రదము. కాని ఆర్థికముగా హరిజనులయెడల ఉదాసీనభావము చూపుట కిది ప్రత్యామ్నాయ మెంతమాత్రమును కాజాలదు. ఇన్నాళ్లనుండి మనము హరిజనులకు చేయుచుండిన పాపమును పోగొట్టుట మాత్రమే గాక సాంఘికముగా హరిజనులకు అభివృద్ధి కలిగించుట హరిజనోద్యమముయొక్క అభిప్రాయమై యున్నది. ఉద్యమము అనేక ముఖములు కలది. ఆర్థిక, రాజకీయ, నైతిక, మతవిషయముగా సమస్యను విచారింప దగియున్నది.

కావున మనము హరిజనులయెడల చేయుచుండిన అపచారమును తొలగించి మన హరిజన సోదరులను మనతోబాటు వారినిగాచేయ ప్రయత్నించెదము గాక! వారికి మనము పౌరసత్వపుహక్కులను చేకూర్చుటకును రాజకీయాభివృద్ధిని చేకూర్చుటకును, ప్రయత్నించెదముగాక! హృదయము మారినచో అస్పృశ్యతా నివారణయగును” అని మహాత్ముడు చెప్పుచున్నాడు. “హృదయములు ద్రవ్యము వెచ్చించుటవలన మారవు. త్యాగము, ఆధ్యాత్మిక లక్ష్యముగలవారు మనలో

నున్నప్పుడే హృదయపరివర్తనము కలుగును. ఇట్టివారు మనలో నున్నందుకు గుర్తు విస్తారముగా ద్రవ్యము సమకూర్పుటయే, హృదయపరివర్తన కలిగినందుకు గుర్తు హరిజనులలో నిరంతరము మనము పనిచేయుటయె. ద్రవ్యములేనిది మనము నిరంతము పనిచేయు వీలుకాదు. పుష్కలముగా ద్రవ్యములేనిది హరిజనులకు పాఠశాలలుగాని, వసతిగృహములుగాని కట్టింపజాలము. ద్రవ్యములేనిది హరిజనులకు బావులు, చెరువులు త్రవ్వింపజాలము. కావున హరిజన సేవాసంఘమునకు ధనికులును, బీదలును తమతమ శక్తుల ననుసరించి ద్రవ్యసహాయము చేయుడు" అని మహాత్ముడు చెప్పెను. ఈవిజ్ఞాపనముతో నేను ఈవ్యాసమును సమాప్తము చేయుచున్నాను.

---

# 5 వ వ్యాసము.

# హిందూ మహమ్మదీయ సఖ్యము.

:o:

## దేశప్రజలందరును జాతీయభావపూరితులు కావలసిన ఆవశ్యకత.

[ డాక్టరు పట్టాభి సీతారామయ్యగారు. ]

బహుసులభముగా నున్నట్లు గపడునవి ఆచరణమునందు బహుకష్టసాధ్యము లగుచుండును. ప్రపంచమునందలి యన్ని దేశములలోను జాతీయభావము హెచ్చు పెరిగినదిరోజులివి. ఈజాతీయ భావమెంత హెచ్చుగానున్నదో ఐరోపాఖండము నందలి దేశముల వైఖరివలన స్పష్టముకాగలదు. ఐరోపాఖండమునందలి వివిధ దేశములలోను జాతీయభావము హెచ్చు పెరుగుచున్నను అవి అన్యోన్యము కలహింపక, శాంతియుతముగా పరస్పర విభేదమును మరచి ప్రవర్తించుచుండుట యితర దేశములవారికి మార్గదర్శకముగా నుండదగును. కాని మనదేశమునం దిట్లు లేకుండుట శోచనీయము. మనదేశము అనేక ఖండములుగాను విభజింపబడియున్నది. ఈ విభేదములు 6 వేల మైళ్లదూరమునుండి మనదేశమును పరిపాలించుచున్న వారిచే కల్పింపబడి, బుద్ధిపూర్వకముగా ప్రోత్సహింపబడు చున్నవి. తమ సామ్రాజ్యము యొక్క బలమును వృద్ధిచేసికొన జూచుచున్నవారు ఈవిభేదములను మనలో కల్పించి ప్రోత్సహించుచున్నారు. మనదేశములో నేగ్రామమునకు బోయిచూడుడు. ప్రజల మత మేదైనను వారు హిందువులయినను సరే మహమ్మదీయులైనను సరే, సవర్ణులైనను సరే అవర్ణులైనను సరే వారి యార్థికసమస్య లొక్కటే యను విషయము మనకు స్పష్టముకాగలదు. అదిగాక, ఎక్కడనో ఒకచోట హిందువులును మహమ్మదీయులును కలహించుచున్నను సామాన్యముగా వారు మిత్రభావమున నున్నారని కూడ విదితము కాగలదు. గ్రామములలో హిందువులును మహమ్మదీయులును తమతమ మతములు వేరను మాటను మరచి భాయ్ భాయ్ అనుకొను చున్నారు. ఆర్థిక సాంఘికసమస్యలందరికిని ఒకటే. దురదృష్టవశమున నొక వఱదగాని, అగ్నిభయముగాని, గాలివాన గాని వచ్చినచో నది మత, వర్ణ, జాతి విచక్షణ లేక అందరికిని నష్టము చేయునుగదా! ప్రకృతి మానవునికిని మానవునికిని తారతమ్యము కల్పింపదు గదా! దానికి అందరును సమానులే. ప్రకృతి

ప్రసన్నమై యున్నచో దానివలన కలుగు లాభము అందరికిని సమానమే. ప్రకృతి భీభత్సరూపము దాల్చి ప్రపంచమును కలవర పరచుచో దానివలన కలుగు నష్టమందరికిని సమానమే. ఇట్టి తరి, మానవులు కృత్రిమభేదములు కల్పించి, ఒకనికి మరి యొకనికి భేదములు కల్పించి భారతదేశములో నొక పౌరునికిని మరియొక పౌరునికిని భేదము లేల కల్పింపవలెను ?

## రెండు శతాబ్దముల
## ఆంగ్ల పరిపాలనవలన ఫలము.

దాదాపు రెండు వందల సంవత్సరములు ఆంగ్లేయులు మన దేశములో పరిపాలన చేసినతరువాత ప్రజలకు భారత దేశములోని భేదములు తప్ప మరేవియు నంత స్పష్టముగా నగపడవు. మన దేశములో నెన్నిరకములైన విభేదములు కల్పింప బడినవో చూడుడు. భారత దేశము యొక్క వైశాల్యములో మూడవ వంతును, జనాభాలో నాల్గవ వంతును నైన భారత సంస్థానములు తక్కిన దేశము నుండి వేరుచేయబడినవి. ఈసంస్థానములు సంధులు, ఒడంబడికలు, సన్నదుల మూలకముగా నాంగ్ల సార్వభౌమునికి బాధ్యులుగానున్నారు. తత్వతః ఈసంస్థానములు ఆంగ్లేయప్రభుత్వము చెప్పు చేతలలో నున్నవి. ఆంగ్లేయు లనుగ్రహించి యుండుమన్న ఈసంస్థానము లుండును. లేనిచో ఉండవు. ఈసంస్థానములు చిన్న ఉద్యోగియగు "గవర్నరు జనరలు ఏజంటు" కును, తద్వారా పొలిటికల్ సెక్రెటరీకిని, తద్వారా రాజప్రతినిధికిని, తద్వారా ఇండియామంత్రి, ఆంగ్ల సార్వభౌమునికిని జవాబుదారిగా నున్నారు. భారత దేశము నందలి 561 సంస్థానములును గవర్నరు జనరలు ఏజంటు యిష్టానిష్టములమీద, ఆగ్రహానుగ్రహముల మీద ఖ్యాలుమీద నాధారపడి యుండునన్నమాట.

ఇది యిట్లుండ, దేశము 11 రాష్ట్రములుగా విభజింపబడియున్నది. ఈరాష్ట్రములలో ప్రజాభిప్రాయము వ్యక్తముకాకయుండునట్లు ఎన్నికలపద్ధతి జరుపబడుచున్నది. ఐనను ప్రజాభిప్రాయమే యిటీవలయెన్నికలలో వ్యక్తమయ్యెను. ఇందువిషయమున బ్రిటిష్ వారి సంకల్పములు భగ్నమయ్యెను.

దేశము నీవిధముగా ఖండఖండములుగా విభజించినమీదట, భిన్న భిన్న మతములుగాగూడ విభజింపబడినది. హిందువులని, మహమ్మదీయులని, క్రైస్తవులని, సిక్కులని, హరిజనులని విభేదములు కల్పింపబడినవి. ప్రతి మతమువారికిని ప్రత్యేక నియోజకవర్గము లేర్పరుపబడినవి. కుమ్యులేటివ్ వోటింగుపద్ధతిద్వారా ఎన్నికలవిషయముగూడ ఒక సంఘము మరియొక సంఘమునకు పోటీగా నిలువబెట్టబడుచున్నది. మంత్రివర్గములలో ప్రతి సంఘమునకును ప్రతినిధు లుండవలెనని కోర్కె అధికారులచే ప్రోత్సహింపబడుచున్నది.

ఈ భేదమునకుతోడు, దేశము పట్టణప్రాంతమని, గ్రామప్రాంతమని రెండుగా విభజింపబడుచున్నది. భారతదేశమునందలి బ్రిటిషు ప్రభుత్వమువారు గ్రామములకంటె పట్టణప్రాంతముల నెట్లు యెక్కువగా నభిమానించుచుండిరో యిప్పు డందరికిని తెలిసియేయున్నది. పట్టణ ప్రాంతములలోనున్న ప్రజలపై విధింపబడుచున్న పన్నులు గ్రామప్రాంత ప్రజలకంటె తక్కువ.

ఈవిభేదములకుతోడు దేశము మైదానప్రదేశమనియు, ఏజన్సీప్రాంతమనియు రెండు భాగములుగా విభజింపబడియున్నది. ఏజన్సీ ప్రాంతములలో బ్రిటిషు ప్రాంతములయందలి హక్కులు, న్యాయశాస్త్రము వర్తింపవు. అక్కడ నిరంకుశ పరిపాలనము మైదానప్రాంతములకంటె హెచ్చు. ఇవిగాక దేశములో తేయాకు తోటల యజమానులని, ఐరోపీయ వర్తకులని, విశ్వవిద్యాలయములని, స్త్రీలని కొన్ని ప్రత్యేకశ్రేణులు లేర్పరుపబడి, వారికి ఎన్నికలలో ప్రత్యేక నియోజక వర్గము లేర్పరుపబడియున్నవి. ఈవిభేదము లన్నియు భారతదేశమును భిన్నభిన్నములు చేసినవి.

దేశము నిట్లు భిన్నభిన్నములుగా చేసినందుకు కారణము పైన చెప్పియే యుంటిని. ఆంగ్లసామ్రాజ్య రక్షణకొరకై దేశమును అనేక రకములుగా విభజించి వారిప్పుడేమనుచున్నారు. ఈదేశము ఒక్కజాతిగాదు. అనేకజాతులు, అనేక మతములు, అనేకవర్గములు ఈదేశములో నున్నవి. అని వారనుచున్నారు. మన పరిపాలకులు చెప్పు ఈ మాటలను మనము నమ్ముచున్నాము. శాసనసభలకు ఎన్నికపద్ధతి లేనప్పుడు ఈ విభేదములు దేశముయొక్క రాజకీయజీవనమునందంతగా కనబడకుండెను. 1893 సం॥లో ఇంపీరియలు లెజిస్లేటివు కౌన్సిలుకును, రాష్ట్రీయ శాసన సభలకును ఎన్నికపద్ధతి యేర్పరుపబడెను. అంతవరకు ఈ సభలలో ప్రభుత్వనియోజితులే యుండిరి. 1893 సం॥లో మద్రాసు రాష్ట్రీయ శాసనసభయందు 7గురుమాత్రమే ప్రజాప్రతినిధులుండిరి. ఈసంఖ్య 1908 సం॥లో 28 కి హెచ్చింపబడినప్పుడు మతవైషమ్యములు ప్రారంభమయ్యెను. హిందువులకును, మహమ్మదీయులకును విభేదములు కలిగించుటకే 1905 సం॥లో వంగదేశమును రెండుగా విభజింప బ్రిటిష్ పరిపాలకులు సంకల్పించిరి. ఈ విభజనమువలన మహమ్మదీయులలో భేదభావము మొదట ప్రారంభమయ్యెను. అప్పటివరకు ఆంగ్లేయులు హిందువుల నభిమానించుచుండిరి. కాని హిందువులలో జాతీయభావము ప్రబలుచుండుటజూచి దాని నరికట్టుటకు తూర్పుబంగాళములో మహమ్మదీయరాష్ట్రమొకటి కల్పింపబడెను. 1905 సం॥ నందు చేయబడిన బంగాళావిభజనము 1911 సంవత్సరములో రద్దుచేయబడెను. కాని హిందువులలోను మహమ్మదీయులలోను కలిగింపబడిన విభేదభావము, వైషమ్యము నానాటికి వృద్ధికాజొచ్చెను. 1908 సం॥ నాటికి ఈవిభేదములు ఈవైషమ్యములు బాగుగా స్థిరపడి కలహములుగా మారెను. దీనివలన దేశమునకు కలుగు అనర్థములను ప్రజానాయకులు గ్రహించి దానిని

తొలగించుటకు 1916 సం॥ లో చర్యలైకొనిరి. కాని అందరికిని కలిపి సంయుక్త నియోజకవర్గము లేర్పరుచుటకు సాధ్యపడలేదు. 1916 సం॥ లక్నోప్యాక్టులో మహమ్మదీయులకు ప్రత్యేక నియోజకవర్గము లంగీకరింపక తప్పదయ్యెను. అప్పటి నుండియు ఈప్రత్యేకత హెచ్చెను. రెండుసంఘములవారు ఒడంబడిక చేసికొనవలెనన్న ప్రత్యేక నియోజకవర్గముల ప్రాతిపదికమీదగాని అది సాధ్యపడకుండవచ్చెను. కాని, 1921 సం॥ నందు ఖిలాఫత్ ఉద్యమము భారతదేశ మహమ్మదీయులకు సంభవింపజేసినప్పుడు తాత్కాలికముగా విభేదములన్నియు మరుపబడెను. 1921 సం॥ లో ఖిలాఫత్ సమస్య పరిష్కారముకాగానె తిరిగి భేదభావము వృద్ధియయ్యెను. 1924 సం॥ లగాయతు గత సంవత్సరమువరకు యీసంఘముల వారును తీవ్రముగా కలహించుకొనుచుండిరి.

## ప్రజాసామాన్యముతో కాంగ్రెసువారి సంపర్కము.

ఈ కలహములు కొన్ని వేళల పోటీలుగాను, కొన్ని వేళల సంఘర్షణలుగాను, కొన్ని వేళల యుద్ధములుగానుండెను. ఈసంఘర్షణలు, ఈపోటీలు, ఈయుద్ధములు ఆంగ్ల విద్యాధికులు స్వప్రయోజనముకై కల్పించినవిగాని, ప్రజల అభివృద్ధికై గావని కాలక్రమేణ ప్రజలు గ్రహించిరి.

కాంగ్రెసువారు ఈవిషయమును 1931 సం॥ లోనే గ్రహించిరి. గాంధి మహాత్ముడు రెండవ రౌండుటేబిల్ కాన్ఫరెన్సు నుండి తిరిగి రాగానే వర్కింగ్ కమిటీవారికి గావించిన ప్రకటనలో ఈవిషయము స్పష్టము చేయబడెను. ఇక ముందు భారత రాజ్యాంగ నిర్మాణమునందు మార్పుకావలెనని కోరుచో హిందువులును మహమ్మదీయులును కలిసి కోరవలెననియు, రౌండు టేబిలు సభలో కొన్ని విభేదములుండక తప్పదని తాననుకొని యుండినను లండనులో హిందువులును, మహమ్మదీయులును, మితవాదులును కాంగ్రెసువాదులు యింత తీవ్రముగా కలహింతురని తాననుకొనియుండలేదనియు మహాత్ముడు చెప్పెను. ఒకవిషయమును తెలిసికొనినంత మాత్రమున నది నెరవేరినట్లుకాదు. రౌండు టేబిలు సభలో వివిధమతములవారు పరస్పర వైషమ్యభావమును వెలిబుచ్చుటవలన దేశప్రజలు కండ్లు తెరచిరి. ఆశయముకై ప్రస్తుతమును, సాంఘిక క్షేమముకై జాతీయ క్షేమమును, తాత్కాలిక ప్రయోజనముకై సిద్ధాంతములను ఆహుతి చేయువారీ దేశములో నుందురని ప్రజలు బాగుగా గ్రహింపగలిగిరి. అని మహాత్ముడు చెప్పెను.

కావున, గత సంవత్సరమునుండియు కాంగ్రెసులో సామాన్య ప్రజలను చేర్చు ఉద్యమము ప్రారంభింపబడినది. కాంగ్రెసు మొదట ధనికులచే ప్రారంభింపబడెను. తరువాత మధ్యతరగతులవారు కాంగ్రెసును వశపరుచుకొనిరి. తరు

వాత అనగా మహాత్ముడు నాయకుడైనప్పటి నుండియు నది సామాన్యజనమునకు వశమయ్యెను. కాని ప్రతివాడు దానిలో చేర నవకాశము లేకపోయెను. ప్రతి వానిని కాంగ్రెసులో చేర్చుటకు ఈరెండు సంవత్సరములనుండియు ప్రయత్నము జరుగుచున్నది. హిందూ సామాన్య ప్రజలను, మహమ్మదీయ సామాన్య ప్రజలను గూడ కాంగ్రెసులో చేర్చుటకు ప్రయత్నములు జరుగుచున్నవి. అసగా హిందూ మహమ్మదీయ సఖ్యతకై రాయబారములు ఆంగ్లవిద్యాధికులగు మహమ్మదీయులతో గాక హిందువులతో భుజములు రాచుకొను సామాన్య మహమ్మదీయులతో చేయ వలసిన సమయము వచ్చుచున్నదన్నమాట. ఈప్రయత్నము కొంతవరకు ఫలప్రద మయ్యెను. సామాన్య గ్రామ, వ్యవసాయ, పారిశ్రామిక జీవనమునందు హిందువు లకును, మహమ్మదీయులకును విభేదములు సంఘర్షణలు అసలే లేవని మనము అనుకొని నదే గనుక అనుకొన్నదానికంటె మంచి ఫలితములు కలిగినవని మనము చెప్ప దగదు. త్వరలో మహమ్మదీయ ప్రజలు కాంగ్రెసులోనికి వచ్చి కాంగ్రెసును సంపూర్ణముగా ప్రజాప్రతినిధిసంస్థ చేసెదరని యూహింపదగును. ఆరోజు వచ్చి నప్పుడు భారతదేశమునకు స్వాతంత్ర్యము తప్పక లభించును. మరియు దేశములో నన్ని మతములవారును ఏకమై అభివృద్ధి నొందుటకు అవకాశము లేర్పడును.



# 6 వ వ్యాసము
# కాంగ్రెసు మంత్రివర్గములతో
# వచ్చిన మార్పు

—:0:—

## దేశహిత కార్యముల పర్యాలోచన

[ డాక్టరు పట్టాభి సీతారామయ్యగారు ]

కాంగ్రెసువారు ఆరురాష్ట్రములలో నాలుగునెలలక్రితము ఒక రాష్ట్రములో యిటీవలను మంత్రివర్గముల నేర్పరచిరి. ఈనాలుగు నెలలలోను వీరు చేయగలిగిన పనిని గూర్చి యీగాంధిజయంతి వారమున మనము సింహావలోకనము చేయుట సమంజసమగును. ఇంత స్వల్పకాలములోనే మీరు చేసిన పనులను వివరింపుడని మంత్రులను కోరుట మామూలు పరిస్థితులలో అనుచితముగానే కనబడును. దేశమున ముఖ్యముగా జరుగవలసిన పనులు అనేక సంవత్సరములనుండి నిలువబడియున్నవి గాన కాంగ్రెసు మంత్రివర్గములు వెంటనే వాటి నన్నిటిని నెరవేర్చెదరను నభిప్రాయము ప్రజలలో నత్యధికముగా కల్గినది. ప్రజలలో ఓరిమి పూర్తిగా తొలగిపోయినది:

### జీతములను తగ్గించుకొనుట.

మంత్రులు చేసిన మొదటిభాగము చాల తక్కువజీతములను పుచ్చుకొనిరి. నెలకు 500 రూపాయలకంటె హెచ్చుజీత మెవ్వరికిని ఉండకూడదు. అని కరాచీ కాంగ్రెసు మహాసభలో నిర్ణయింపబడెను, దానినిగూర్చి ఆలోచించుటకు భారత కాంగ్రెసు కార్యసంఘమువారొక ఉపసంఘమును నేర్పరచిరి వారు మచిలీపట్టణములో సమావేశమై చర్చించిరి, 500 రూపాయలు మంత్రికి చాల తక్కువజీతమే యని సభ్యులు తలచిరి గాని చివరకు దానిని స్థిరపరచిరి, కాంగ్రెసు మంత్రులింత స్వల్పమొత్తమున కంగీకరింపరు గాని యీ నిర్ణయము భగ్నమగునని కాంగ్రెసునకు ప్రతికూలురగువారు అత్యుత్సాహముతో గమనించుచుండిరి. కాని వారికి గొప్ప ఆశాభంగము కలిగినది. దీనినిగూర్చి కాంగ్రెసువారి కెన్నడును సంశయము కలిగియుండలేదు.

## ఖైదీల విడుదల.

దౌర్జన్యముతో లేశమైనను సంబంధములేకుండ కేవలము రాజకీయములకు మాత్రమే శిక్షింపబడినవారు కొందరున్నారు. మరికొందరిపైని దొరతనమువారి కోర్టులలో కేసులు చేయలేదు గాని వారికి దౌర్జన్యపక్షముతో సంబంధమున్న దని దొరతనమువారు ప్రకటించిరి. ఇట్టి ఖయిదీలు కొందరున్నారు. మంత్రులు ఉచితజ్ఞతతో రాయబారములను జరిపి యీఖయిదీల నందరిని విడుదలచేయింప గలిగిరి.

సంయుక్తరాష్ట్రములలో కకోరి కుట్రకేసు ఖైదీలనుగూడ విడుదలచేసిరి. వడిగా పోవుచున్నరయిలును ఆపి ఒకగార్డును తుపాకీతోకాల్చి ఆపెట్టెయినులో నున్న వేలకొలది రూపాయిలను తీసుకొనిపోయిరని కకోరి ఖైదీలపై కేసుచేయ బడెను. కావున అట్టివారినిగూడ కాంగ్రెసు మంత్రులు విడుదల చేయింప గలుగుట మిక్కిలి గొప్పకార్యమే యగును.

## అహింసానిరతి.

మరియొక గొప్పవిషయమేమనగా యీఖైదీలందరునుగూడ తమకు అహింసా సిద్ధాంతమునందు గట్టినమ్మకము కలిగినదని ప్రకటించిరి.

## ధరావతులను తిరిగి యిచ్చివేయుట.

25 యేండ్లనుండి దొరతనమువారు మనుష్యులమీద మాత్రమేగాక అచ్చు ఆఫీసులమీదగూడ దాడివెడలిరి. అచ్చుఆఫీసుల యజమానులవద్దనుండియును గూడ వారు వేలకొలది రూపాయిలు ధరావతుగా రాబట్టిరి. అచ్చుయంత్రములు గూడ దోషులే అని వారు నిశ్చయించిరి, ఏదోయొక నేరమునకు యీమొత్తము ల నన్నిటిని మరల నిచ్చివేయుట చాల కష్టమైన పనియేయగును.

## మంత్రుల ప్రకటనపై విమర్శలు.

ఖైదీలను విడుదలచేయుట ధరావతులను మఱరాయిచ్చుట మున్నగు విష యములనుగూర్చి మదరాసు మంత్రివర్గమువారు చేసిన ప్రకటనలో "ప్రజలీ సదుపాయములను దుర్వినియోగము చేయరని నమ్మెదరు. వారు చట్టవిరుద్ధముగా ప్రవర్తింపగూడదు." అను వాక్యముగూడనున్నది. ఇప్పుడు వదలబడినవారు వెనుక నేరమునుచేసిరని మంత్రులు నిశ్చయించినట్లు దీనివలన తేలుచున్నదని పలువు రాక్షేపించిరి. ఖైదీల విడుదల ఉత్తరువులు ప్రకటించుటకు ముందు గవర్నరుకును, మంత్రులకును ఎట్టి రాయబారములు జరిగినవో మనకు తెలియదు. పట్టువిడుపులులేకుండ నిది సాధ్యపడదనియే మనము ఊహింపవచ్చును. ఈఉత్త

దవులు చేయగలుగునిమిత్తము మంత్రులు కొన్నిటికి అంగీకరించియే యుందురు. లేదా వారు మొదటివారములోనే రాజీనామా నియ్యవలసియుండును. కాంగ్రెసు వారు పదవులను స్వీకరించవలెనని చాల ఆందోళనము చేయుచున్నవారు, మొదటి వారములోనే మంత్రులు రాజీనామా నియ్యవలెనని సలహా నియ్యజాలరు. కాని మంత్రులు తమ ప్రకటనలో నింకను సరళమైనభాషను వాడియుండవచ్చును. వారు చాల కఠినమైనవాక్యములనే వుపయోగించిరి.

## మెడికలు కాలేజికి భారతీయుని ప్రిన్సిపలుగా నియమించుట.

నూరేళ్ళనుండి మదరాసులో మెడికలుకాలేజి ప్రిన్సుపలుపదవికి ఇండియను మెడికలు సర్వీసుకుజేరిన ఇంగిలీషువారే నియమింపబడు చుండిరి. ఇండియను సివిలు సర్వీసు, ఇండియను పోలీసు సర్వీసు, ఇండియను మెడికలుసర్వీసు యివి మూడును యిండియాలో బ్రిటిషు సామ్రాజ్యవాదులకు ముఖ్యస్థానములు. ఈశాఖ లలో ఆంగ్లేయులే ఉద్యోగులుగ నుండవలెననునది వారి స్థిర నిర్ణయము. సివిలు సర్వీసులోను పోలీసు సర్వీసులోను కొద్దిమంది భారతీయులనుగూడ నియమించు చున్నారుగాని మెడికలు సర్వీసులో భారతీయులను నియమించుటయేలేదు. ఇట్టి స్థితిలో కాంగ్రెసు మంత్రులు మదరాసు మెడికలు కాలేజికి ఒక భారతీయుని ప్రిన్సిపాలుగా నియమించుట అసాధారణమైన పనియేయగును. ఇది తమకు గొప్ప నష్టమనియే ఇండియాలోని బ్రిటిషువారును, బ్రిటిషు ప్రభుత్వ ప్రతినిధులునుగూడ భావించియుందురు. ఈవిషయములో ఆరోగ్యశాఖామంత్రి అధికమగు మనోబలమును, ధైర్యమును, ఆత్మశక్తిని ప్రకటించి యుండవలెను.

## మంత్రులు నిరాడంబరముగ తిరుగుచుండుట.

మదరాసునగరములోనున్నపుడు, యితరస్థలములకు వెళ్ళినపుడునుగూడ మంత్రులు చాల నిరాడంబరముగా ప్రజలతో కలసి మెలసి తిరుగుచుండుట మరియొక గొప్ప విషయము. క్రొత్తవారు వీరిని చూచినచో ఎవరో కాంగ్రెసు వాలంటీరు లని తలచెదరేగాని మంత్రులని తెలుసుకొనజాలరు. ఇందువలన ప్రజలకు వీరిపైని గౌరవము చాల అధికమైనది. ప్రజలలో ఉత్సాహమును ఆశయునుగూడ చాల అధికమైనవి.

## పాతమంత్రులనుట లోపము.

ఇంతకుపూర్వము మంత్రులుగామండెడివారి వేషభాషలు విలక్షణముగానుం డెడివి, వారు తమ ప్రతిష్ఠకు భంగము కలుగునని ప్రజలతో కలసి మెలసి యుం డెడివారుకారు. అధికార పటాటోపమును, బాగుగా చూపుచుండిరి. ఒక అధికృత తమకు కలదని తలంచి దానిని నిలుపుకొనుటకు ప్రయత్నించుచుండిరి.

కాంగ్రెసు మంత్రులు వీటినన్నిటిని తుడిచిపెట్టివేసిరి. ప్రజలతో కలసి మెలసి తిరుగుచుండిరి. సభలలో వారితో పాటు వట్టి నేలపైని చతికిలబడుచుండిరి. దేశభాషలలోనే ఉపన్యసించుచుండిరి. మంత్రులు కాకపూర్వమెటుల నుండెడి వారో మంత్రులైన పిమ్మటగూడ నటులనే యుండిరి.

## జాతీయపతాకము.

జాతీయపతాకములను యిండ్లపైనను కచేరీలపైనను ఎత్తగూడదను నిషేధము తొలగినది. మంత్రులు వచ్చినపుడు మ్యునిసిపలు కచేరీలపైని స్వేచ్ఛగా జాతీయజండాల నెగురవేయుచున్నారు. ఇందువలన దేశమానం దంతటను కాంగ్రెసువారికి చాల సంతృప్తి కలిగినది.

## గవర్నరు ఉపన్యాసము

మదరాసు గవర్నరు ఎర్స్కిను ప్రభువుగారిమధ్య నుపన్యసించుచు ప్రభుత్వోద్యోగులందరును మంత్రుల ఆజ్ఞలను నెరవేర్చవలెను. రాజకీయ సంస్కరణ కార్యక్రమమును కొనసాగించుటలో మంత్రులకు తోడ్పడవలెను, అని గవర్నరు నుడివెను. ఇది చాల ప్రశంసనీయము.

## ప్రాతికూల్య మంతరించలేదు

ఈరీతి కాంగ్రెసు మంత్రులు ప్రయత్నముల జయప్రదముగా జరుగుచున్నను ప్రాతికూల్యము అంతరించలేదు మంత్రుల ప్రయత్నములను భంగపరచుటకు కొందరు (మ్యునిసిపాలిటీలు జిల్లాబోర్డులు) ప్రయత్నములను చేయుచున్నారు. కంజీవరము మునిసిపలు భవనముపైని జాతీయపతాకమును నెలకొల్పవలెనని ఆసంఘమువారు స్థానిక స్వపరిపాలన మంత్రుల కోరిరి, మంత్రి రేపువచ్చి జాతీయపతాకము నెత్తుననగా ముందునాడు మ్యునిసిపలు కమీషనరు గుర్పాచప్పు మునకుండ భవనముపైని యూనియనుజాకు పతాకమును లేవనెత్తిరి. తనపై అధికారియగు మంత్రికి ఆసమాచారము తెలియజేయలేదు. ఆనాడు మంత్రి అచటికి వచ్చునని అచట 5000 మంది ప్రజలు చేరియుండిరి. మంత్రివచ్చి యూనియనుజాకును చూచి సిగ్గుపడునని యు, మంత్రికి మంచి పరాభవము జరుగుననియును విద్వేషులు మురియుచుండిరి. ఆనాడు మంత్రి కంజీవరము వచ్చెను. మ్యునిసిపలు కార్యాలయము చెంతనుండియే వెడలిపోయెను.

తిరుచునాపల్లి జిల్లాబోర్డు సభలో అధ్యక్షునకును, ఉపాధ్యక్షునకును మోటారుకారు లుండవలెను. వాటిని కొనుటకు 8000 రూపాయిలు (ఒకకారు 4000)

వ్యయపరచవలెను. వాటిని సరియైనస్థితిలో నుంచుటకు నెలకు 150 రూపాయిలు యిచ్చుచుండవలెను. వీరిద్దరును సభలకు వచ్చినరోజులలో రోజుకు 25 రూపాయిలు ఒక్కొక్కరికి ఇచ్చుచుండవలెను. అను తీర్మానము ఆమోదింపబడెను. మంత్రులను ఎగతాళి చేయుటకే ఈతీర్మాన మామోదింపబడెను గాని ప్రజలు దీని నిజోద్దేశమును సరిగా గ్రహించియుండలేదు. కాంగ్రెసు మంత్రులు స్వపరిపాలనమును సరిగా నెరవేర్చు చున్నారని తలచి మన దేశమునందున్న ఆంగ్లేయులందరును, ఉద్యోగులును యితరులును మనఃపూర్వకముగా మంత్రులకు తోడ్పడుచుండగా మనదేశీయులలో కొందరు మంత్రులకు ప్రతికూలురుగా నుండుట మిక్కిలి శోచనీయము, ఇది కేవలము అల్పబుద్ధి.

## మంత్రుల త్యాగము

ఇటుల కొందరు తమ నీచబుద్ధిని వెల్లడించుచున్నను మంత్రులు లెక్కచేయుటలేదు. రైలులో మూడవ తరగతి బళ్లలోనే ప్రయాణము చేయుచున్నారు. శా స న స ం ఘ స భ్యు డు సభలకు వచ్చినరోజులలో వారి కీయ్యవలసిన దినబత్తెముల మొత్తమును తగ్గించి వారికి కొద్దిజీతము నేర్పరచిరి. శాసనసభ్యతను సభ్యులు ధనార్జన సాధనముగా చేయుటకు వీలులేకుండ చేసిరి. వారు సంవత్సరము పొడుగునను పనిచేయుచునే యుండవలెనని విధించిరి. ఇవి అల్పవిషయములేయైనను మంత్రులలో కలిగిన నూతన భావము వీటివలన విదితమగును గాన నివి చాల ముఖ్యమైనవేయగును. జమీందారులును, లక్షాధికారులును అవలంబించెడిపద్ధతులు అంతరించినవి. సామాన్యప్రజలవలంబించెడి పద్ధతులు అమలులోనికి వచ్చినవి.

## రైతులకును జమీందారీ రైతులకును సహాయము

మనదేశమునందలి ప్రజలలో వ్యవసాయము వృత్తిగాగల వారి సంఖ్యయే మిక్కిలి హెచ్చుగానున్నది. వారిలో జమీందారీ రైతుల స్థితి మిక్కిలి దుర్భరముగా నున్నది. వీరిస్థితిని వెంటనే చక్కబరచవలెను. అందుకొరకు 9 మంది నిలచి ఒకసంఘ మేర్పరుపబడెను. ఈప్రయత్నము నందరును చాల ప్రశంసించిరి. వీరు విచారణచేసి నివేదికను పంపెదరు. అనేకసంవత్సరములనుండి రైతు లనుభవించుచున్న కష్టములు ఒక సంవత్సరములోనే తొలగగలవని ప్రజలు ఆశించుచున్నారు. భూమి సంబంధమైన విషయములు తరువాత పరిష్కరింపబడును. వాటికి తొందరలేదు.

## రైతు ఋణబాధ

గ్రామములో రైతులు ఋణబాధవలన నలిగిపోవుచున్నారు. ఈయిబ్బందిని తొలగించుటకు మంత్రులు మారటోరియంబిల్లు అను నొకబిల్లును ఉపపాదింప

తలచి దానిని ప్రకటించిరి. 400 రూపాయలు శిస్తును వెంటనే టాక్సు చెల్లించుచున్న రైతులు తీర్చవలసిన బాకీలనుగూర్చి ఎట్టిచర్య జరుపగూడదు, అని దీనిలోనున్నది. దీనిని వెంటనే అమలులో పెట్టకుండ మంత్రులు కాలయాపన మొనరించుచున్నారని కొందరు ఆక్షేపించసాగిరి. ఈబిల్లులో చాల లోపము లున్నటుల విమర్శలవలన విదితమైనది. ప్రజలు వ్యాయవాదులు భూములులేని వడ్డీ వ్యాపారులు వర్తకులు వ్యాపారులు మున్నగువారును రైతులును గూడ దీనిలో గల లోపములను వెల్లడించిరి. ఈలోపములను సవరించుటకు మంత్రులు ఆలోచించుచుండగా ఈబిల్లును ప్రకటించుట గొప్ప పొరపాటని ఆక్షేపణలు బయలుదేరినవి. ఈబిల్లును ప్రకటించిన వెంటనే చట్టమును చేయకపోవుటవలన ఋణదాతలు రైతులపైని చర్య జరుపుటకు అవకాశము లభించినది. అందువలన రైతులపైని దావాలు జప్తులు వారంట్లు మున్నగునవి చాల అధికమైనవి. ఈబిల్లును ప్రకటించుటవలన రైతుల కష్టములు మరింత అధికమైనవి. అని వీరాక్షేపించుచున్నారు. ప్రజలు కొందర పెట్టుటవలననే మంత్రులు యీబిల్లును ప్రకటించిరి, ప్రకటించిన వెంటనే చట్టము చేయకపోవుటవలన రైతులకు చాల యిబ్బంది కలిగినదని యిప్పుడు మరల ఆక్షేపణలు బయలుదేరినవి.

## గతకాలమునకు కూడ బిల్లును వర్తింపజేయుట.

ఈ బిల్లు గతకాలమునకుగూడ వర్తించుననీ మంత్రులు ప్రకటించినచో యీచిక్కు వదలును. ఇప్పుడెన్నుబిల్లును భారతశాసనసభలో 26-1-37 తేదీన ఉపపాదించిరి. గాని 1-1-37 నుండియు అది అమలులో నుండునని ప్రకటించిరి. బిల్లు 26-1-37 నుండి మాత్రమే అమలులోనికి రావలెనని చాలమంది సభ్యులు వాదించిరి గాని వారి ప్రయత్నము కొనసాగలేదు. కావున మారిటోరియంబిల్లు మదరాసు అసెంబ్లీలో ఉపపాదింపబడిన తేదీనుండియు అమలులోనికి వచ్చునని మంత్రులు ప్రకటించుటకెట్టి అభ్యంతరమును లేదు. ఈచట్టమువలన రైతులకును నిజమైన లాభమేమియును కలుగదు. ఏలననగా ప్రస్తుతము ఋణదాతలు వారిని బాధించుటకు వీలుండదేగాని రైతులు ఋణమును తీర్చవలసియేయున్నది. పైగా వడ్డీ పెరుగుచుండును. కావున యీచట్టముతోపాటు ఋణములను పరిష్కరించుటకును వాటిని తీర్చుటకునుగూడ తగిన ఏర్పాటులు జరుగవలెను. లేనిచో యీ చట్టమువలన చాల నష్టము కలుగునేగాని యెట్టి లాభమును కలుగదు.

## ఇతర సదుపాయములు ఖైదీలకు మజ్జిగ

రివిన్యూమంత్రి రైతుల ముజరాల నిమిత్తము 75 లక్షలును ఖద్దరుపెట్టుబడి నిమిత్తము 2 లక్షలును ప్రత్యేకించెను. ఖైదీలకందరికిని మజ్జిగనియ్యవలెనని ఆజ్ఞాపించబడెను. ఇది చాల ముఖ్యమైనది. ఆమార్గమునుగూర్చి వేరు వేరు రాష్ట్రములలో పద్ధతులు వేరు వేరుగా నుండును. మన రాష్ట్రములలో ముఖ్య

ముగా ఆంధ్రదేశములో నిరుపేదలుగూడ మజ్జిగను త్రాగకుండనుండరు. మజ్జిగను త్రాగిన, అలసటతొలగి మనసుకు ఉల్లాసముకలుగును. ఇపుడు మద్యపాన నిర్మూలన సన్నాహము జరుగుచున్నది, గాన ఇపుడు ప్రజలు మజ్జిగను మిక్కిలి హెచ్చుగా కోరెదరు. సి క్లాసు ఖైదీలకు మజ్జిగ నియ్యవలెనని రాజకీయ ఖైదీల మగు మేమందరమును చాల ఆందోళనము చేసితిమి. ఇపుడు చెరసాలలమంత్రి దీనిని ప్రవేశపెట్టెను యిది చాల ముఖ్యమైనది.

ఆరోగ్యశాఖామంత్రి ఆశాఖలో చాల మార్పులను చేయుచున్నాడు.

రిలిజియసు ఎండోమెంట్సు బోర్డుధర్మాదాయములకు రాజకీయపార్టీ-

గత 15 ఏండ్లనుండి పోయిన కలిగినంత సంబంధము తొలగింపబడును. ఎండోమెంట్సుబోర్డు రద్దుచేయబడును.

## గాంధి—ఇర్విను—ఒడంబడిక.

## బొంబాయిలో భూములను మరలనిచ్చివేయుట.

ఇతరరాష్ట్రములలో గూడ కాంగ్రెసు మంత్రులు చాల సంస్కరణములను చేసిరి. గాంధి-ఇర్విను ఒడంబడిక ప్రకారము దొరతనమువారు వశపరచుకొనిన భూములను వెంటనే ప్రజలకు వశపరుపవలసియుండును. ఆ ఒడంబడిక జరిగిన 15 రోజులకే యిర్విను ప్రభువు ఇండియానుండి వెడలిపోయెను. తరువాతవచ్చిన రాజప్రతినిధి ఆ ఒడంబడికను చిత్తుకాగితముల క్రింద చూచెను. సత్యాగ్రహ సమయమున మరల నిరాకరణమునందు పాల్గొనినవారి భూములను దొరతనము వారు వశపరచుకొనిరి. వాటిని మరల నిచ్చివేయవలెనను షరతుకు ఇర్వినుప్రభువు అంగీకరించెను. అప్పుడు యిద్దరు డిప్యూటీకలెక్టరులు రాజీనామా నిచ్చిరి. వారినిగూర్చి మరల ఆలోచించెదనని ఇర్విను ప్రభువు వాగ్దానముచేసెను. కాని అటుల జరుగలేదు. ఇపుడు బొంబాయిలో మంత్రులు ఆభూములను మరల యజమానులకు వశపరచుట మిక్కిలి ప్రశంసనీయము.

బొంబాయిలో దొరతనమువారు యూనిఫారముల నిచ్చుచున్న ఉద్యోగుల కందరికిని ఖద్దరు యూనిఫారముల నిచ్చుటకు దొరతనమువారు నిశ్చయించిరి. హరిపురమున భారత కాంగ్రెసు మహాసభలు జరిగెడు రోజులలో తమ ఉద్యోగులకు సెలవిచ్చుటకు బొంబాయిరాష్ట్రమునందలి సూరత్తుజిల్లాబోర్డు వారు నిశ్చయించిరి.

## బీహారు—సంయుక్త—బెంగాలురాష్ట్రములు.

ఈ మూడు రాష్ట్రములలోను రైతులహక్కులనుగూర్చిన బిల్లులు చాల అవసరము. బెంగాలులో తక్కిన రెండు రాష్ట్రములలోను యీ బిల్లుల నుపపాదించిరి

1908 నుండియూ యీబిల్లు మదరాసులో అమలులోనున్నది. మదరాసులో రైతులకున్న హక్కులుగూడ బీహారు సంయుక్త బెంగాలు రాష్ట్రములవారికి లేవు సంయుక్త రాష్ట్రములలో న్యాయశాఖను కార్యనిర్వాహకశాఖను విడదీయవలెనను తీర్మానమామోదింపబడెను.

## ఉత్కళము.

ఉత్కళమున గాంధిమహాత్ముని వర్ధంతినాడు ప్రభుత్వ కార్యాలయముల కన్నిటికిని సెలవియ్యబడెను

## మధ్యరాష్ట్రములు.

మధ్యరాష్ట్రములలో భారతీయుడగు త్రివేదీ ఐ. సి. ఎస్. గారు ప్రభుత్వ ప్రధాన కార్యదర్శిగా నియమింపబడిరి. మరే రాష్ట్రములలోను ఈపదవికి భారతీయులను నియమించియుండలేదు. గాన నిది చాల ముఖ్య విషయము.

ఈ రీతిగా కాంగ్రెసు మంత్రులు అన్ని రాష్ట్రములలోను చాల సంస్కరణములను అమలు జరుపగలిగిరి. ఇంకను అమలు జరుపబడవలసినవి చాల యుండవచ్చునని మూనాలుగు నెలలలోను మంత్రులు చేయగలిగిన పని గాంధి జయంతి వారమున ప్రజల కందరికిని తెలియజేయుట ముఖ్యకర్తవ్యమై యగును.

---

# 7 వ వ్యాసము

# కాంగ్రెసు మంత్రుల కర్తవ్యము.

—:o:—

## వెంటనే నిర్వర్తింపవలసిన విధులు.

[ డాక్టరు పట్టాభి సీతారామయ్యగారు. ]

### అన్ని రాష్ట్రముల మంత్రులును కలసి ఆలోచించుట.

కాంగ్రెసు మంత్రివర్గము లేర్పడిన అన్నిరాష్ట్రములలోని మంత్రులును ఒకచో సమావేశమై యిదివరకు తాము చేయగలిగిన పనులను యిటుపైని చేయవలసిన పనులనుగూర్చి ఆలోచించుట అవసరమని తోచుచున్నది. మంత్రులందరును కలియుటకంటె ప్రతిరాష్ట్రము నుండియును ఆరోగ్యశాఖ విద్యాశాఖ మొదలగు వేరువేరు శాఖల మంత్రులు వేరువేరుగా కలసి ఆలోచించుటవలన ఎక్కువ ప్రయోజనము కలుగగలదు.

### న్యాయశాఖను, కార్యనిర్వాహకశాఖను విడదీయుట

ఇది మిక్కిలి ముఖ్యమైనది. అన్ని రాష్ట్రములలోను సాధ్యమైనంత త్వరలో నిది జరుగవలెను. ఇండియాలో బ్రిటిషు దొరతన మేర్పడినప్పటినుండియును ఇవి రెండును కావలసియే యున్నవి. కాంగ్రెసు మహాసభ యేర్పడినప్పటి నుండియును వీటిని విడదీయవలెననియే కోరుచున్నది. ఇపుడు ప్రజారంజకముగు కాంగ్రెసు మంత్రివర్గము లేర్పడినవి గాన వీటిని విడదీయ నవసరములేదని మదరాసు ప్రధానమంత్రి నుడివెను. ప్రజల విశ్వాసమును బడసిన మంత్రివర్గ మేర్పడినను ప్రజలకు అసమ్మతమగు మంత్రివర్గ మేర్పడినను నిరంకుశవర్గమువారి పరిపాలన మేర్పడినను సివిలు క్రిమినలు వ్యవహారములలో ప్రజలహక్కుల కట్టి భంగమును అవివేకుల వలనను మంత్రుల వలనను కలుగగూడదు. ఫిర్యాదీ, జడ్జీ, జ్యూరీ యీ మూడువర్గములవారును చేయవలసిన పనులను ఒక్కడే చేయుచున్నను నేరము మోపబడిన వానికి న్యాయస్థానమున న్యాయముకలుగునని తెలుపుట సాహసోక్తియే యగును. కాంగ్రెసు మంత్రులు అధికారమునకు వచ్చినంత మాత్రమున మానవ

స్వభావము మారదు. కాంగ్రెసు మంత్రులకును వారికి లోబడిన ఆఫీసరులకును కోపము, పగదీర్చుకొనవలెనను పట్టుదల, దురభిప్రాయము, మొండిగానే అభిప్రాయము స్థిరపరచుకొనుట యున్నను లోపములు సహజముగానే కలవు. వీటిని రెంటిని వెంటనే విడదీయుట అవసరమని సంయుక్తరాష్ట్రములలో కాంగ్రెసు మంత్రివర్గములవారిదివరకే నిశ్చయించిరి.

## భాషాప్రయుక్త రాష్ట్రవిభజనము.

ఇపుడు ఇండియాలోనున్న రాష్ట్రవిభజనము కేవలము కాలక్రమాగతము. ఇది మానవశాస్త్రమునకును, తర్కశాస్త్రమునకును, మనశ్శాస్త్రమునకును గూడ సంబంధించినది కాదు. బ్రిటిషువారు ఇండియాకువచ్చిన క్రొత్తలో కొన్ని ప్రాంతములను వశపరచుకొనిరి. దరిమిలాను మరికొన్ని భాగములను వాటికి చేర్చిరి. ఆప్రకారమే వారు రాష్ట్రముల నేర్పరచిరి. రాష్ట్రీయ స్వపరిపాలనము మాతృభాషామూలకమున శాసనసభలు కోర్టులు, కాలేజీలు, కౌన్సిళ్ళు మున్నగువాటిగుండ ప్రజలకు సంతృప్తికరమగు రీతిని జరుపబడవలెను తమ భావములను తమ యిబ్బందులను తమ కోర్కెలను ప్రజలు మాతృభాషలో వెల్లడించుట కవకాశము లుండవలెను. లేనిచో అది సరియైన రాష్ట్రీయ స్వపరిపాలనము కాజాలదు. మదరాసు ప్రెసిడెన్సీలో అయిదు భాషలను మాటలాడు ప్రజలున్నారు. బొంబాయిలో మూడు భాషలను మాటలాడువారున్నారు. మధ్యరాష్ట్రములలో రెండుభాషలను మాటలాడువారున్నారు. వీరి ప్రతినిధులు శాసనసభలో నుందురు. ఒకరిభాష ఒకరికి తెలియదు. అధ్యక్షునకుగూడ తన మాతృభాషమాత్రమే తెలియును. భాషలనుబట్టి రాష్ట్రములు యేర్పరుపబడువరకును రాష్ట్రీయస్వపరిపాలనము నేర్పరుప గూడదనిగూడ వెనుక మనము నిశ్చయించియున్నాము.

## సత్యాగ్రహ సమయమున
## వసూలు చేయబడిన ధనమును మరల నిచ్చివేయుట.

సత్యాగ్రహము జరిగినరోజులలో దొరతనమువారు కాంగ్రెసుకుచేరిన ప్రజల ధనమును వశపరచుకొనిరి. జుల్మానాలను వేసిరి అధనమును తీసుకొనుటకు వారి సొత్తులను వేలములో విక్రయించిరి. ఇంకను వసూలుకాని జుల్మానాల నిపుడు వసూలుచేయుటకు వారి సొత్తులను జప్తుచేసి వేలమువేయించుటకిపుడు ఉద్యోగులు ప్రయత్నించుచున్నారు. ఇది మిక్కిలి అనుచితము. వసూలుచేయబడిన ధనమును జుల్మానా మొత్తములను వేలములో నమ్మబడిన భూములను మరల హక్కుదారుల కిచ్చివేయవలెను. ఇటుపైని యెట్టి చర్యలను జరుపగూడదు.

## ఖద్దరు బట్టలనే వాడవలెను.

యూనిఫారములను ధరించవలసిన ఉద్యోగుల కందరికిని ఖద్దరు యూనిఫారములనే యియ్యవలెను. ఆసుపత్రులు మున్నగువాటికి బట్టలను సప్లయి చేయుటలో ఖద్దరుబట్టలనే సప్లయి చేయవలెను. అన్ని రాష్ట్రములలోను యీపద్ధతినే యేర్పరుపవలెను.

## ఖయిదీలలో ఏ. బి. సి. క్లాసులుండగూడదు.

ఇప్పుడు కాంగ్రెసు మంత్రులుగా నున్నవారిలో మిక్కిలి హెచ్చుమంది చెరసాలకు వెళ్లినవారేగాని వీరు సి. క్లాసు ఖయిదీలుగా నుండలేదు. అయినను సి. క్లాసు ఖయిదీల కష్టములు అందరికిని బాగుగా తెలిసియేయున్నవి. ఖయిదీలలో నిట్టి విభాగమును కలిగించుట కాంగ్రెసువారిలో చీలికలను కలిగించుటకే. దీనివలన ఖయిదుకు వెళ్లిన కాంగ్రెసువారిలో సి. క్లాసువారికి ఏ-బి- క్లాసులవారిపైని యీర్ష్యాద్వేషములు కలిగినవి. కావున వీటిని తొలగించవలెను. ఇపుడు బి. క్లాసువారి కియ్యబడుచున్న సౌకర్యములను రాజకీయ ఖయిదీల కందరికిని హెచ్చుతక్కువలు లేకుండ కలుగజేయవలెను.

## కాంగ్రెసువారికి ఉద్యోగములు.

ఐర్లాండు మహాసంగ్రామము ముగిసినపిమ్మట ప్రభుత్వ శాఖలన్నిటిలోను ఉద్యోగులను నియమించుటలో యుద్ధములో సోల్జరులుగా నుండినవారినే నియమించవలెనని నిర్ణయింపబడెను. అటులనే యిపుడు ఉద్యోగులను నియమించుటలో కాంగ్రెసువారినే నియమింపవలెను.

## స్థానిక స్వపరిపాలనశాఖ.

ఈశాఖను పూర్తిగా సంస్కరింపవలెను. ఒక రాజకీయ పక్షమువారు అధికారములోనున్నపుడు తమ పార్టీ నాయకులకు అధికారమును చేకూర్చుటకు వీలగునట్లు బోర్డుల నేర్పరచిరి. అది మిక్కిలి అనుచితముగాన సరియైనరీతిని బోర్డుల నేర్పరుపవలెను. స్థానికసంస్థల పరిపాలనము శ్రేష్ఠముగా జరుగుటకును, గ్రామవాసులు పరిపాలనలో శ్రద్ధవహించగలుగుటకును తాలూకాబోర్డులను మరల నేర్పరుపవలెను. తాలూకాబోర్డు లేర్పరుపబడిన పిమ్మట గ్రామస్థులకు చాల సదుపాయములు కలిగినవి.

## భూమిపన్ను మున్నగు పన్నులను తగ్గించుట.

భూమిపన్ను మున్నగు పన్నుల నన్నిటిని తగ్గించవలెను. వీలైనంతవరకు భూమిపన్నును రద్దుచేయవలెను. పదియకరములకు మించని మెట్టభూమిమీదను,

5 యకరములకు మించని వల్లపుభూమిమీదను భూమిశిస్తును వసూలు చేయగూడదనుటలో గల భావము భూమిశిస్తును పూర్తిగా రద్దుచేయవలెననునదియే. ఇందువలన దొరతనమునకు ఆదాయము తగ్గునుగాని దానినికూడ దీయుటకు ఉద్యోగముల జీతములను తగ్గించవలెను. 1912-13 లో నున్న జీతముల స్కేలును మరల అమలులోకి తేవలెను, అటుపిమ్మట జీతములు చాల హెచ్చింపబడెను. వాటి నిపుడు తగ్గించవలెను.

## గ్రామోద్యోగుల స్థితిని బాగుచేయుట.

గ్రామోద్యోగులస్థితిని బాగుచేయవలెను, వారు జమాబందీకి వచ్చినపుడు వారికి ప్రయాణపు ఖర్చులనుగాని, బత్తెములనుగాని యిచ్చుటలేదు. ఇది మిక్కిలి అన్యాయము. ఇందువలన గ్రామాధికారులు లంచములను పుచ్చుకొనవలసి వచ్చుచున్నది. గ్రామమునకు వచ్చిన ప్రతి ఉద్యోగికిని గ్రామాధికారులు భోజనాది సౌకర్యములను (సప్లయి) కలిగించవలసియున్నది. ఇది చాల అన్యాయము. ఇచ్చుటయును పుచ్చుకొనుటయునుగూడ నేరమే అని ప్రకటించవలెను.

## జమీందారీలను రద్దుచేయుట.

ఇది చాల శ్రద్ధగ నాలోచింపదగిన విషయము. ఈస్టుఇండియా కంపెనీవారు క్రొత్తగా ఇండియాకు వచ్చినపుడు తమలాభము కొరకు జమీందారీల నేర్పరచిరి. భూములను సాగుబడిచేయించి వచ్చిన ఆదాయములో కొంతఆదాయమును విదేశీయులగు కంపెనీవారి కిచ్చుటకు అంగీకరించినవారికి అపుడు కంపెనీవారు జమీందారులని పేరుపెట్టిరి. కావున మొట్టమొదట మనదేశమునకు ద్రోహము చేసినవారు జమీందారులే. కావున జమీందారులకు న్యాయమైన ముజరాలనిచ్చి జమీందారీపద్ధతిని రద్దుచేయవలెను. ఇపుడు ఒక జమీందారివలన వచ్చుచున్న ఆదాయములో సగమువంతును (పదివేలు) యిపుడున్న జమీందారున కియ్యవలెను. ఇతని కుమారునకు దీనిలో సగము (5 వేలు) ను, అతనికుమారునకు అనగా ఇపుడున్న జమీందారుని మనుమనికి దానిలో సగము ($2\frac{1}{2}$ వేలు) ను యిచ్చుచు యీరీతిగా క్రమక్రమముగా తగ్గించి చివరకు పూర్తిగా రద్దుచేయవలెను. జమీందారులు భూస్వామియైన ప్రభుత్వమునకు కవులుదారులు కావున కవులును రద్దుచేయుటకు భూస్వామి కధికారమున్నది.

## స్వంతభూములులేని కార్మికులకు గయాళు భూమి.

దేశములోని స్వంతభూములులేని కార్మికులు చాలమంది యున్నారు. సాగుబడిలేని భూమిగూడ హెచ్చుగానేయున్నది ఈదేశములో 37 కోట్లమంది ప్రజలున్నారు. 25 కోట్ల యకరముల భూమిమాత్రమే సాగుబడి జరుగుచున్నది.

సాగుబడిచేయబడవలసిన భూమి 15 కోట్ల యకరములున్నది. భూములులేని కార్మికుల సహకారసంఘముల నేర్పరచి యాగయాళుభూమిని వీరికి పంచిపెట్టవలెను. వీరు తమభూములను విక్రయించుటకు అధికార ముండగూడదు. లేనిచో వారు భూమిని వడ్డీవ్యాపారులు మున్నగువారికి విక్రయించెదరు. ఈభూమికి సహకార సంఘమువారు భూస్వాములుగానుండి కార్మికులకు కొంతభూమిని కౌలు కిచ్చుచుండవలెను. మొదటి పదియేళ్లలోను వీరివలన యేపన్నును వసూలు చెయ్యగూడదు. ఈగయాళు భూములను బాగుచేయుటకు చాలధనమును వ్యయపరచవలెను. కొన్ని సంవత్సరములపాటు కష్టపడి పనిచేయవలెను. చాలకాలము ఇటుల కష్టపడి పనిచేసి వేలకొలది రూపాయలను వ్యయపరచుటవలననే యిపుడు పల్లపుభూములు బాగుగా ఫలించుచున్నవి.

## తుంగభద్ర ప్రాజెక్టు

దీనివలన ఆంధ్రదేశములో చాల జిల్లాలకు మంచి లాభము కలుగును. ఈ ప్రయత్నము 20-25 యేళ్లకు పూర్వమే ప్రారంభింపబడినను వెనుకబడిపోయినది. దరిమిలాను ప్రారంభింపబడినవానికి ప్రాధాన్యమియ్యబడెను.

## గ్రామముల అభివృద్ధి

సరియైన భూమిశిస్తువిధానము నేర్పరచి భూస్వాములను భూములు లేని వారినికూడ పోషించవలెను. గృహపరిశ్రమల నభివృద్ధి నొందించుట ముఖ్యతమము. మొదటినుండియును భారతజాతీయతకును విజ్ఞానమునకును గ్రామములే ముఖ్యస్థానములుగానుండెను. వృత్తివిద్యలన్నియును గ్రామములలోనే వృద్ధినొందుచుండెను. కావున వివిధరాష్ట్రములలో కాంగ్రెసు మంత్రివర్గములవారు కలసి ఆలోచించి గ్రామములలో చేతిపనులను వృద్ధినొందించవలెను. అంతరించినట్టియు, అంతరించుచున్నట్టియు గ్రామ పరిశ్రమలను మరల నిలువబెట్టవలెను. అందులకు కావలసిన ధనమును పెట్టుబడి పెట్టవలెను. దేశముయొక్క ధనము నగరములనుండి పట్టణములకు, పట్టణములనుండి గ్రామములకును మరల ప్రవహించునట్లు చేయవలెను.

## నిరుద్యోగ సమస్య

పూర్వకాలమునందు ఆయాకులములవారు తమ కులవృత్తులను వదలకుండుట వలన నిరుద్యోగసమస్య కలిగియుండలేదు. ఒకడు చేయగలిగినంతపని పూర్తిగా వానికి లభించక పోవచ్చును. కాని అసలే పనిలేకుండ నుండెడిదికాదు, ప్రజలకు వ్యవసాయమే ముఖ్యవృత్తిగా నుండుటవలన ఇతర కులవృత్తులపనులు తక్కువగా నుండినను వ్యవసాయము ఆదాయమువలన ఆలోటు తీరిపోవుచుండెను. వ్యవసాయమును చేతిపనులును పరస్పర సహాయకములుగా నుండెను. ఇపుడు మరల నట్టి యేర్పాటు జరుగవలెను.

## సహకార ఉద్యమము

సహకార ఉద్యమములో గూడ స్వపక్ష పురభిమానము చాల అధికమైనది. ఇదివఱకున్న మంత్రివర్గములవారు తమ పక్షమువారినే అందరిని రిజిస్ట్రారులముగా నియమించిరి. కావున శాఖలలో యీమనస్థితి తొలగింపవలెను. రిజిస్ట్రారులు జాతీయభావముతో పనిచేయవలెను. సహకారోద్యమము చట్టసమ్మతముగ నిర్మాణ సంస్కరణమునకు తోడ్పడవలెను. గాని ఏదో యొక రాజకీయ పక్షమునకు తోడ్పడగూడదు.

## విద్యాశాఖ

ఇపుడు విద్యాలయములలో గరీబీతు, సైనికుల శిటాలములలో తరిబీయువలెనే యున్నది. కఠిన నిబంధన లేర్పరుపబడెను. బెంచీల పొడుగు ఎత్తు ఒకతరగతిలో విద్యార్థులసంఖ్య నడుపవలసిన కాలము చదువవలసిన విషయములు, పరీక్షలు, నూటికి రావలసిన మార్కులు, మున్నగు సమస్త విషయములును నిర్ధారణ చేయబడెను. వీటిలో అపుడపుడు మార్పులుగూడ జరుగుచున్నవి. రంపములరాట్నములోని లక్కముక్కలు గిరగిర తిరుగుచుండునే గాని ముందుకు పోవనట్లు యీవిద్యావిధానము గూడ ముందుకు పోవుటలేదు. జాతి వృద్ధినొందుటకును, జాతిలో సహజశక్తిని వికసింపజేయుటకును, నిర్మాణశక్తికి స్వేచ్ఛనొసగుటకును, పూర్తిగా పనిచేయగలుగుటకు యీవిధానము ఎంతమాత్రమును ఉపయోగించుటలేదు. మాతృభాషలోనే అన్ని విషయములను చేర్పవలెను పరిపాలనమును కోర్టులో వ్యవహారమును గూడ మాతృభాషలోనే జరుగవలెను. అపుడు అన్ని విషయములను ప్రజలందరును బాగుగా తెలుసుకొనగలుగుదురు. ఈరీతిగా భారతజాతీయతను నిర్మింపవలెను. జరుగవలసిన యేర్పాటులలో మిక్కిలి ముఖ్యమైన వాటినిమాత్రమే నేనిచట వివరించితిని. మంత్రులది చేయలేరు ఇది చేయలేదని అనుకొనుటవలన లాభములేదు. వారు ప్రబలులతో పోరాడవలసియున్నది. వీరు గూడ పాశ్చాత్య విద్యా నాగరకతలలో పెరిగినవారే. కావున మొదట వీరికి ఆత్మసంస్కరణ మవసరము. వీరి మనసులలో మార్పు కలుగవలెను. వీరు జాతీయ దృక్పథమును అలవరచుకొనవలెను. వీరు అనాగరకతను పోగొట్టుకొనవలెను. ఇది మంత్రులు సాధించవలసిన మొదటి కార్యము. ఇది నెరవేరినచో వారి ఆత్మలు పునీతములగును. వారి భావములు విస్పష్టమగును. అపుడు వారు అనాది భారతజాతీయ వృక్షముయొక్క అంటుకు మఱియొక క్రొత్తరెక్కను తగిలించవలెను. ఇది ఎంతవరకు కొనసాగునో తెలియదుగాని ప్రజలవత్తిడి ఎంత హెచ్చుగానుండునో అంత శీఘ్రముగ సంస్కరణములు జరుగుచుండును.

విద్యాశాఖామంత్రి ఆశాఖలో ముఖ్యమైన మార్పులను చేయవలెనని ప్రజల తోడ్పాటు హెచ్చుగా నుండవలెను. లేనిచో యేపనియును జరుగదు. ఇందు

విద్యార్థులును తలిదండ్రులును ఉపాధ్యాయులును గూడ చాల నిరోధములను కలిగించుచున్నారు.

ప్రాథమిక పాఠశాలలును మాధ్యమిక పాఠశాలలును స్వయంపోషకములుగా నుండవలెను. కేవలము పాండిత్యప్రధానమగు విద్యనుమాత్రమే నేర్పగూడదు. దానితోపాటు వృత్తివిద్యలను సయింటుఫిక్ విషయములనుగూడ నేర్పుచుండవలెను. విశ్వవిద్యాలయములలో చదువగోరువారి సంఖ్యను తగ్గించవలెను. ప్రజలసహాయము లేనిచో విద్యాశాఖామంత్రిగాని యితరమంత్రిగాని యేపనిని చేయజాలరు. గాంధి జయంతివారమున ప్రజలందరును వీటినిగూర్చి ప్రథమ ప్రయత్నమును ప్రారంభించవలెను.

---

# కాంగ్రెసు మంత్రివర్గాలు

—— :౦: ——

## వెంటనే ఆచరించవలసిన ప్రణాళిక.

---

[ డాక్టరు పట్టాభి సీతారామయ్యగారు ]

---

ఇప్పుడు కాంగ్రెస్ మంత్రులు పదవులను స్వీకరించుటవలన శాసనసభలకి లోపల బయట వీరి కార్యక్రమ మేదికానున్నదీ అనే ప్రశ్నను గూర్చి ప్రజాభిప్రాయం సహజంగా ప్రచలితమైయున్నది. అధికారంలో ఉన్న ప్రభుత్వాన్ని విమర్శించే వేడుకలో తగుల్కొనిఉంది కాంగ్రెసు ఈ 52 సంవత్సరాలనుంచి. ప్రజామోదం పడసిన మంత్రులకు కొంతమటుకు ప్రభుత్వం అధీనమయినదీ మధ్యనే. అంతవరకున్నూ కాంగ్రెసు బయటినుంచి విమర్శిస్తూ వేడుక చూస్తోంది ఇప్పుడు ఒకమాదిరి రాష్ట్రస్వాతంత్ర్యం రాష్ట్రాలకి ప్రసాదింపబడి, ఇరు పక్షాలనుంచీ తర్జన భర్జనలూ వాదోపవాదాలు జరిగిన వెనుక ఈస్వాతంత్ర్యం నిసమైందని ఒప్పుకోబడటంచేత, మంత్రులు పట్టిచూడవలసిన ప్రశ్నను కాంగ్రెసు వారందరూ— శాసనసభల్లో సభ్యులైనవారు కానివారు అందరూ తర్కించటం ఉచితమై యుంది.

### ఉద్యోగములను తిరిగిఇచ్చుట.

గత 16 ఏళ్ళనుంచీ అష్టకష్టాలకూ లోనయి కాంగ్రెసునాయకుల కిపుడు ప్రభుత్వహోదా ఇవ్వగలిగిన కాంగ్రెసు పక్షీయులకి వెంటనే న్యాయం జరగాలి. ఉద్యమంలో ఉద్యోగాలని పోగొట్టుకున్న లేక రాజీనామా యిచ్చిన కరణాలకు, మునసబులకు, పంతుళ్ళకు, డిప్యూటీకలెక్టర్లకు, ఉన్నతఅధికారులకు ఇంకా ఇతరులకు తిరిగి ఉద్యోగాలు ఇచ్చివేయటం జాతికి చేయవలసిన దోషపరిహారంలో మొదటిది.

### జరిమానాల నిచ్చివేయుట

జరిమానాలు విధింపబడి ఇచ్చుకున్నవారికి, వాటిని వాపసుచేయుట చాలా సమంజసంగా ఉంటుంది. ఎందుకంటే, చాలా సందర్భాల్లో ఈ జరిమానాలు

వెంటనే రొఖురూపంగా వసూలు కాలేదు. జరిమానాలు విధింపబడిన వారి ఆస్తులను అమ్మటంవలననో లేక వీరిచ్చిన బాకీలను దఖలు పరచుకోటంవలననో ఈ జరిమానాలు వసూలైనవి. ఈజరిమానాలన్నిటిమొత్తం 3 లేక 4 లక్షల రూపాయలకి మించదు. వీటిని వాపసుచేయటం చాలా సమంజసంగా ఉంటుంది.

## నిర్బంధ శాసనాలని ఎత్తివేయుట-

రాష్ట్ర సభలకి చేతనైనంతవరకూ ఇపుడమలులోనున్న నిర్బంధశాసనాలని ఎత్తివేయటానికి ప్రయత్నం జరగాలి. క్రిమినల్ లా ఎమెండ్‌మెంట్ ఆక్టు మున్నూ, ప్రెస్ శాసనాలనిన్నీ, ఇవి కేంద్రసభ చేతిలోనైనప్పటికి- ప్రతిరాష్ట్రమ్నుంచీ ప్రతిఘటించాలి కొత్త పత్రికలనుంచీ, అచ్చుకూటాలనుంచీ ధరావతు లడగటానికింతతో స్వస్తి చెప్పాలి.

## లోకల్‌బోర్డ్సు ఆక్టును సవరించుట.

ప్రాతజిల్లాబోర్డును చీలికలు చేయటంమూలంగా తమపక్షీయుల్ని అధికారంలోకి తీసుకురావటానికి పూర్వ ప్రభుత్వం చేసిన పన్నాగాలవల్ల జరిగిన అపకారాన్ని తుదముట్టించేందుకు వెంటనే ఈఆక్టు సవరించే ఉపాయం చూడాలి. ఈ విధంగా మళ్ళీ గ్రామ పెద్దరికాన్ని నిలబెట్టాలి. స్థానిక స్వపరిపాలనను నేరుగా పల్లెటూళ్ళలోకి కొనిపోయినది తాలూకాబోర్డులు. ప్రదేశానుసారముగా రెండు మూడు తాలూకాలు గలపిన తాలూకాబోర్డులే మరల ఉద్ధరింపబడాలి. ఈ కార్యాన్ని సాధించటానికి ఇపుడున్న జిల్లాబోర్డుల విభజనని కడముట్టించాలి, స్థానిక స్వపరిపాలనా విధానం అంతా కొత్తగా రచించాలి.

ఇక మునిసిపల్ కమీషనర్లను నియమించవలసిన ప్రశ్నను విచారింపవచ్చును. ప్రతిప్రభుత్వ శాఖమీదా ఇపుడు ప్రభుత్వమే అధికారం చలాయిస్తూ ఉండటంవల్ల ప్రభుత్వాధికారులు స్థానిక సంస్థలకు సాయముగా పంపబడినపుడు ఈ అధికారులు నిరంకుశంగా, ప్రవర్తించలేరేమో అనవచ్చు- అయితే స్థానిక స్వపరిపాలనకు తమ ఉద్యోగాలనిగూర్చి ఎట్టి చింతా లేని శాశ్వతోద్యోగులు ఎక్కువగా తోడ్పడుతారా లేక ప్రతిస్థానిక సంస్థచేత నియమితులయే కార్యదర్శులు, మేనేజర్లు ఎక్కువగా తోడ్పడుతారా అనే ప్రశ్నని జాగ్రత్తగా విచారించాలి. ఈ రెండు వాదాలకీ మద్దతుగా చెప్పేది చాలాఉంది శాశ్వతోద్యోగులు తమ పదవికే భంగమూ కలుగబోదని ఎఱిగి వుంటుటవల్ల, బోర్డు సభ్యుల ఇష్టానిష్టాలని లెక్కచెయ్యక పనిచేస్తూ వుండచ్చు, అయితే వీరిపని కేవలం మరబనిలాగా ఉంటానికి అవకాశంఉంది. అదేవిధంగా మునిసిపల్ సభ్యులచేత ఎన్నుకోబడే కార్యదర్శి ఆసభ్యులని మోసగించటానికే కుట్రజేసి మునిసిపల్ వ్యవహారాల్లో సంక్షోభం కల్గించ

వచ్చు. అయితే మునిసిపల్ వ్యవహారాలని శ్రద్ధతో నిర్వర్తించటానికిన్నీ ప్రజల సభ్యుల ప్రేమాదరాలని చూరగొనటానికిన్నీ అవకాశం ఉంది. టూకీగా చెప్పవలసివస్తే ప్రభుత్వోద్యోగులు ఉద్యోగ ధర్మాన్ని చక్కగా నిర్వర్తించ వచ్చు గాని స్వయంగా తలపెట్టి ఉత్సాహముతో చేయలేకపోవచ్చు. ఇటు సంస్థ చేత నియమింపబడే వానికి ఉద్యోగవిషయము సరిగా తెలియకపోవచ్చు కాని చేసేపనిలో స్వాభిలాష ఆలోచన ఉంటయ్యి. ఈఇద్దరిలోనూ ఎవరినో ఒకరిని ఎన్నుకోవాలి. తాము గడించిన అనుభవాలని గుర్తించుకొని నిష్పక్షపాతంగా తర్కించి వివేచించి ఈవిషయమును నిర్ధారించుకోవటానికీ శాసనసభలోని కాంగ్రెస్ వారు తగిన దక్షతకలవారే.

## భూ మి సి స్తు.

ఇప్పుడన్నిటిలోకి ముఖ్యంగా చర్చింపబడుతున్నది భూమిశిస్తువిధానము. ఈప్రశ్న చాల క్లిష్టంగాకూడా ఉంది. డెల్టాప్రదేశాలలో ఉన్న రైతులకి ప్రసాదింపబడిన మేళ్ళు అంతగా లెక్కలోనికి తీసికోదగ్గవికావు.

(1) అసలు కష్టం కొద్దిపాటి పట్టాదార్ల విషయంలోనే ఉంది. వీరికున్న పొలం లాభదాయకమైన పరిమాణంలో లేదు. అందువల్ల ఆపొలం సాగు ఎప్పుడును నష్టదాయకమే. ప్రథమ ప్రయత్నంగా ఐదు ఎకరాలుగాని అంతకన్న తక్కువగాని ఉన్న పొలాలనుండి శిస్తేమియూ వసూలు చేయబడరాదు. ఈ మాత్రపు ఉపకారమైనా చెయ్యనిదే ప్రజలకు సంతుష్టి కలుగదు. కష్టాలకి లోనౌతూవున్న లక్షలాది జనులకు న్యాయం జరగదు. ప్రత్యేకంగా యీవిషయాలన్నీ దృష్టి యందుంచుకొని రివిన్యూమంత్రి సాధనోపాయాల నన్వేషించవలసియుంటుంది.

(2) "నవమంత్రపు" మంత్రులు 1913-14 లో జరిగిన రీసెటిల్‌మెంటు వల్ల కలిగిన హెచ్చుదలను తీసివేశారు, మురుగు కాలవలనుంచిన్నీ కుంటచెరువుల నుంచిన్నీ వేసుకునే గూడపోతమీద తీరువాను ఎకరానికి రూ 3-12-0 నుంచి రు 2-8-0 తగ్గించారు, ఇంకను వీరు నీటితీరువాను ఎకరానికి 6-4-0 నుంచి రు 5-0-0 లకు తగ్గించినారు. క్రొత్తగా ఆయకట్టులో జేర్చిన భూములమీద నజరానా రుసుమును రద్దుచేసినారు. కొంతకాలంనుంచి ఆయకట్టులో క్రొత్తగా భూములు చేర్చబడుతూనేవున్నయ్యి. సుమారు 12 ఏళ్ళక్రిందట ఈపొలాల వైశాల్యంకొంత పెరిగింది. అప్పుడు డబ్బు వసూలుచేశారు. మళ్ళీ క్రిందటి సంవత్సరంనుంచీ, ఇంకా క్రొత్తగా చేర్పబడ్డ భూములమీద మళ్ళా వసూలు చేయబడినది ఈనజరానా రుసుమొకసారి తీసివేయబడటంవల్లనున్నూ దీనిని రద్దుచేసి సెలవు పుచ్చుకున్నమంత్రులు దీనిని పాతకంకింద కట్టటంవలననున్నూ ఇంతవరకూ ఈ రుసుము చెల్లించినవారిపైకం వారికి మరల వాపసు చేయబడవలెననుట సహేతుకంగా ఉంటుంది. ప్రభుత్వ ప్రకటననుసరించియే వీరు రుసుము చెల్లించియున్నారనే కారణంచేత వీరి కష్టానికిలోను కాగూడదు.

## జమీందారీ కౌలుహక్కు-

జమీందారీ కౌలుపద్ధతినిన్నీ, జమీలల్లో కమతానికున్న పరిస్థితులనున్నూ సంస్కరించటానికి ప్రత్యేకంగా ఒక ప్రభుత్వశాఖకే పనిపడుతుంది. జమీలల్లో ఉన్న పరిస్థితులు సత్వరసంస్కరణ కోసం ఘోషిస్తున్నయ్యి. జమీందారీ శాశ్వత శిస్తుబందీనిగూర్చి ఒకబిల్లుమూలకంగానైనా శాసన సభలో చర్చించటానికి రాష్ట్రప్రభుత్వానికధికారంలేదు. ఈబిల్లు గవర్నర్ జనరల్ హయాంలో ఉంది. కాబట్టి ఈజమీందారీ శాశ్వత శిస్తుబందీని మాపివేయటంవిషయం అట్లాఉంచి, జమీల్లో ఉన్న చెఱువులు చెఱువుగట్లు, బీళ్ళు, బాటలు పోరంబోకలు—వీటిమీద జమీ ప్రజకి హక్కులు కలిగించాలి. జమీందార్లకున్న పలుకుబడి ఐశ్వర్యాలవల్ల ఇవన్ని వారిచేతుల్లోకి నూరేళ్ళ క్రిందటనే వెళ్ళిపోయినయ్యి. ఈవిషయాన్ని అత్యవసరమైనదానివిగా లెక్కించాలి.

## అ డ వు లు

ఆడవులకి దగ్గఱగా వుండికూడా ఇళ్లు గుడిసెలు పాకలు వేసుకోవటానికి కలప తీసుకోవ వీలులేనివారి ఇబ్బందులను సముద్రానికి దాపునవుండికూడా ఉప్పు చేసికొనలేనివారి అవస్థతో పోల్చవచ్చును. సంపత్సమృద్ధమైన ప్రకృతి ఆడవుల్లో కలపనీ, సముద్రంలో ఉప్పునీ ప్రసాదించింది. అయినప్పటికీ, ఈరెంటి ఉపయోగం ప్రజలు పొందటానికి వీలులేదు. పేదవాడైన సేద్యగానికి కమతమునకు ముఖ్యమైన పశువులున్నూ, వీటి కవశ్యమైనబీళ్లున్నూ-ఈరెండూ వాని కందుబాటులో లేవు. వీటి విషయం వెనువెంటనే పరిశీలించాలి.

## పల్లెటూళ్ళ ఋణభారం

రైతుల ఇబ్బందులను గూర్చి విచారిస్తున్నప్పుడు, మనదేశంలోను, జగత్తంతటను యేర్పడ్డ కాటకంవల్ల మరింత తీవ్రమైపోయిన బాధ గ్రామాల ఋణభారానికి చెందినదని చెప్పక తప్పదు. రాష్ట్రీయ మంత్రుల అధీనంలోవున్న పరిమితాధికారాలతోను ఈఋణసమస్యను సరిగా ఎదుర్కొన గలుగుటకు విపులమైనట్టిన్నీ పరిష్కరింపగలట్టిన్నీ ఉపాయ మేదైనా మంత్రులాలోచింప వీలున్నదా అనేది చాలా అనుమానంగాఉంది, అయినప్పటికీ ఈప్రశ్నను తఱచిచూడాలి. మూడేళ్ళకో ఐదేళ్ళకో వెంటనే మారటోరియమును (ఋణపరిష్కారమును కొంతకాలమూ నిలిపియుంచుట) ప్రకటించవలసిన అవసరంఉంది. దీనిలో అప్పుదారుడు ఆస్తి పన్యాక్రాంతం చేయకుండా ఉండేట్టున్నూ, బాకీదారు అప్పుదారుని కోర్టుకీడ్చి ఆస్తి జప్తుచేసి, ఇల్లూ వాకిలీ పనిముట్లూ అన్ని అమ్మించకుండా ఉండేట్టు నిబంధనచేయాలి, ఋణపరిష్కార సంఘములు పరిష్కారము చేసియుండు మొత్తమును బాకీదారున కిచ్చివేయుటకై పెద్దమొత్తమును ప్రభుత్వ మప్పుచేయవలసియుంటుంది,

డబ్బు ఇచ్చివేసే ఉపాయం లేనిదే "ఇంత మొత్తం ఇవ్వవచ్చును" అని పరిష్కారం చేయుట వ్యర్థమవుతుంది. ఇప్పుడు ప్రశ్న దావా నెట్లా పరిష్కరించాలి అనికాదు. డబ్బెట్లా వచ్చేటట్లు చేయాలి అని. చాలా సందర్భాల్లో బాకీ రొఖరూపంగా వసూలయితే ప్రాతబాకీలను నూటికి 50 చొప్పున గూడా పరిష్కరించుకోవటానికి బాకీదార్లు సిద్ధంగా ఉన్నారు. కాని జరుగుతూన్నదేమిటంటే అప్పుదార్లు బాకీదార్లను కాళ్ళవేళ్ళబడి బ్రతిమాలి ఇవ్వవలసిన మొత్తాన్ని ఎంతకో తేల్చుకొని మాయమౌతారు; మళ్ళి కొన్ని నెలలు గడచినవెనుక వచ్చి అంతకు పూర్వమొప్పుకున్న మొత్తంలో ఇంకా తగ్గించమని అడుగుతూ వట్టిచేతులు చూపిస్తారు. అయితే మన దృష్టి ఒక్క గ్రామ ఋణాలమీదే ఉండగూడదు. అప్పుదారు గ్రామంలోఉన్నా బస్తీలోఉన్నా డబ్బు సమకూరే ఉపాయం వెతకాలి. దీనికి ట్రస్టీబ్యాంకులు ఏర్పరచాలి. ఈ బ్యాంకులు అప్పుదార్ల ఆస్తులహామీమీద పదగు ఆస్తులకు ట్రస్టీలుగా నియమింపబడేవారికి డబ్బును అప్పుగా ఇస్తాయి.

## పొలాలులేనివారికి పొలాలు

పొలాలులేనివారికి పొలాలు పంచాలనే విషయాన్ని ప్రధానంచేయాలి. మన దేశంలో సేద్యమవుతూవున్న భూమి లెక్కవేస్తే తల ఒకటికి అర ఎకరం తేలదనిన్నీ అందుచేత భుక్తికిగూడా సరిపోదనిన్నీ ఈమధ్య లిన్లిత్‌గో దొరగారన్న మాటకి తగిన గౌరవమివ్వాలి. అయితే పొలాలులేనివారికి పొలాలివ్వటంలో కేవలం బీడువేసిన నేలనిచ్చి సేద్యానికి వసతులు కల్పించకపోతే నిష్ప్రయోజనం అవుతుంది. పదేళ్ళదాకా భూమిని ఆవ్యాక్రాంతం చేయకూడదనే ఆంక్షనిగూడా ఉపాయశాలులైన సాహుకార్లు తేలిగ్గా తప్పించుకుంటున్నారు. అక్కడలోవుండి పొలాలు పుచ్చుకొనే దిక్కూ మొక్కూ లేనివారు పొలం బీడు పెట్టుకొనిగూడా శిస్తులు చెల్లికోవటం ఎట్లా అని అప్పో సొప్పో తెచ్చి సేద్యం చేస్తారు. ఇట్టి భూములు వాటిఖర్చువి పూడ్చుకోగలిగేటంతవరకు అన్నిరకాల పన్నులకి అతీతమైయుండాలి అందులోగూడా కొన్ని కొన్ని కుటుంబాలకి దరహాంమీద ఇవ్వాలి. ఈ కుటుంబాలు కో ఆపరేటివ్ ఆక్టుక్రింద కలసియుండి, విడివిడిగా ప్రతికుటుంబానికి చీలదీసి ఇచ్చుటకు వీలుగా తగిన ఫలసాయం వచ్చేంతవరకూ భూమిని ఉమ్మడిగా సాగుచేస్తూ ఉండాలి.

## సీటి పారుదల.

భూములు ఫలవంతాలు కావాలంటే వెంటనే కొద్దిపాటి ఇరిగేషన్ ప్రాజక్టులను మొదలుపెట్టే మార్గంచూడాలి. ఇరిగేషన్ విధానానికి రైల్వేలు అడ్డంకిగా వుంటే మైనర్ ఇరిగేషన్ పనులకి పెద్దరకపు ఇరిగేషన్ పనులు ప్రతిబంధకాలుగా వున్నయ్యి. దీనివల్ల కలిగేబాధ సుస్పష్టం. ఆంధ్రదేశంలోఉన్న రాయలసీమ వంటి జిల్లాలున్నూ రాజధానిలోని జిల్లాలన్నింటిలోను వున్న మెట్ట ప్రదేశాలున్నూ ఈవిషయాన్ని మరింతగా దృఢపరుస్తున్నవి.

## సహకారోద్యమము

కొద్దికాలం క్రిందటనే ఈశాఖ పూర్తిగా ప్రభుత్వమయమైపోయింది. ప్రభుత్వంతో జోక్యంలేకుండా జరుగుతున్న పనికి, వద్దో మొర్రో అని వర్కింగుకమిటీ వారు మొత్తుకుంటున్నా పెడచెవినిబెట్టి కేంద్రభూమి తనఖాబ్యాంకుకు ఒక డిప్యూటీ కలెక్టరును కార్యదర్శిగా నియమించటం పూర్తిగా వ్యాఘాతం. పూర్తిగా ఈనిర్ణయంవల్ల వర్కింగ్ కమిటీని ముక్కుకు తాడువేసి లాగినట్లుంది. ప్రభుత్వం చేసిన ఈసూచనను రామలింగచెట్టియార్ గారు- ఎవ్వరూ ఈయన ఇట్లా చేస్తారని అనుకోలేదు, బలపరచి సాగించారు. (శ్రీచెట్టియార్ గారు వియోగ దుఃఖంలోఉన్న ఈసమయంలో వీరిని విమర్శించబూనటం అనుచితం అవుతుంది) ఈఉద్యమాన్ని పూర్తిగా ప్రభుత్వేతరం చేయాలి. ప్రభుత్వము సంఘాల్ని త్రోసి రాజని ప్రత్యేకంగా నియమించి ఉద్యోగులవల్ల వసూళ్ళెంత వడిగా ఐన దిన్నీ, వెంటనే కడముట్టించవలసిన ఈ 'అఫిషియలై జేషన్'వల్లనే ఎట్టి మేళ్ళైన గూడినదిన్నీ అవసరమైతే ఒక సంఘాన్ని ఏర్పరచి విచారణ సలుపవచ్చును.

## ఏజన్సీ ప్రాంతాలు.

ఈప్రదేశాల్లో ఇదివరకు తిరుగుబాట్లు మొదలైనవి తల ఎత్తటానికి గల కారణాలలో ప్రభుత్వోద్యోగుల దుష్ప్రవర్తనము వారి జులుమూ ప్రధానకారణం. సీతారామరాజిదివరకు లేవదీసిన పితూరిసందర్భంలో అట్లాంటిఉద్యోగిపేరు బయటపడ్డది. ఈవిషయం గవర్నరు చేతిలోనిది. గవర్నరువకుగల సదుద్దేశం ఈసందర్భంలో తెలుస్తుంది. మంత్రివర్గం ఈవిషయమై శ్రద్ధవహిస్తే గవర్నరు తోడుకాకపోడు. కాబట్టి ఈవిషయాన్నిగూర్చి వెంటనే విచారణ జరపాలి. యేజన్సీ ప్రాంతాలకు వెళ్లినప్పటికి జుగుప్సాకరములైన విషయములు చెవిని బడుతూవుంటవి. ఏప్రిల్ నెలలో భద్రాచల సమావేశానికి అధ్యక్షతవహించినప్పుడు నాకు గలిగిన అనుభవం నేను కోరుతున్న విచారణ అత్యవసరమని బలపరుస్తోంది.

## మాదక నిర్మూలనము

ఈమాదకనిర్మూలనము ప్రధానిగారికి ప్రాణప్రదం - త్రాగుడు పైకంతో విద్యనేర్పటం ఘోరాతిఘోరం - ఆయన ఆలోచన ఇంత తీవ్రంగా ఉండటం చేతనే ఢిల్లీసమావేశంలో నేనువేసిన ఓప్రశ్నకి జవాబుగా కాలేజీలను త్రాగుడు సొమ్ముతో నడపటంకన్న వాటిని పూర్తిగా మూసివేస్తామన్నారు. దీనికి గవర్నరు ప్రత్యేకాధికారం ఏదీ అడ్డుపడకపోయినప్పటికిన్ని అందువల్ల వీరుచెప్పినది నాప్రశ్నకి సమాధానం కాకపోయినప్పటికిని దీంట్లోనేవీరికి గల దిట్టతనం బోధపడుతుంది. ఈయన విధానానికి దేశంఅంతా హర్షిస్తోంది. కాబట్టి దీన్నిగూర్చి ఏమీ భయపడనక్కరలేదు.

## విద్య.

విద్యావిధానాన్ని మొదలంటా మార్చివేయాలి. స్టథామ్‌గారి సూచనలు కొంతవరకూ బాగానే ఉన్నవి. వినాశానికి హేతువులైన ఈ పాడుపరీక్షలకింతతో స్వస్తి చెప్పాలి. విద్యార్థులు తమ అజ్ఞానంవల్లా, తలిదండ్రులు స్తబ్ధత్వంచేత, పంతుళ్ళు స్వార్థత్వంచేత ఇంకా ఈవిధానాన్నే అంటిపెట్టుకొనియున్నారు. చివరివరకూ దీన్ని పరీక్షిస్తే ఏతావాతా బయటపడే కిటుకు ఇదే. బోలెడు మందిని కాలేజీలకి పోకుండా ఆపివేయటానికిగాను సర్కారుపనిలోనికి ప్రవేశించుట కర్హమైన వయః పరిమాణాన్ని 18 వ ఏటనో 30 ఏటనో ఉంచవచ్చు. స్థితిపరులైనా కాకపోయినా బుద్ధిమంతులకి కాలేజీలవల్ల నష్టంలేకపోవచ్చు కాని వీరిలో విశేష సంఖ్యను వ్యవసాయములోనికి పరిశ్రమలలోనికి మరల్చాలి. ఇందునిమిత్తం ఈశాఖలోగూడా కొన్ని కావలసిన మార్పులను చేయవలసియుంటుంది.

## పరిశ్రమలు

ఖద్దరునకున్నూ, ఇతర గ్రామపరిశ్రమలకున్నూ పరిశ్రమలశాఖ ప్రోత్సాహం కలుగజేయాలి. ఖద్దరు తరువాత ఖద్దరంతటి పట్టు, జరీ పరిశ్రమలు-కళలతోగూడిన పరిశ్రమలను తగినట్లు పోషించి రక్షించుచో మన నాగరకతకుగల విశిష్టతను వెల్లడిచేసి మన సభ్యతకింకను ఉచ్చస్థానమీయగలవు. తివాచీ పరిశ్రమను మరల ఉద్ధరించి పూర్వౌన్నత్యమునందునట్లు చేయవలయును.

## గృహ పరిశ్రమలు

అనగానే గ్రామాలవిషయం వస్తోంది. జాతికంతకూ మూలాధారం గ్రామమే కావాలి- పారిశుద్ధ్యము, వైద్యసహాయము- ఇవి వెంటనే జరుగునట్లు చూడవలయును. కాలేజీ విద్యార్థి ప్రతివాడున్నూ పల్లెటూరిలో ఒక్కసంవత్సరము ఉచితముగా బడిపంతులవలె పనిచేయనిదే 'డిగ్రీ' యివ్వరాదను నియమమేర్పర్చి నిరక్షరతను మాపివేయవలెను. పట్టానొందుటకు ముందు అనుభవశాలురవద్ద ప్లీడరులు కాదలచువారు పనిచేర్చికొనుట లేదా? అట్లాగే ఇతర శాఖలకు చెందు విద్యార్థులు గూడా స్వంతఖర్చుమీద పల్లెటూరులలోఒక్క సంవత్సరకాలము ప్రాథమిక విద్యను నేర్పవలయును.

## పెద్దజీతాల కోత.

జాతీయాభివృద్ధికోసరం చాలా డబ్బుతో పనిపడుతుంది, మరి ఈడబ్బెక్కడనుంచి వస్తుంది? రు 200 పైన తీసుకొనే జీతాలమీద మజరా ఇప్పించటమే దీనికి మార్గం. అట్లాంటి ప్రభుత్వోద్యోగు లందరూ స్వయంగా తమజీతంలో నూటికి 25 చొప్పున ఇవ్వవలసినదనీ జీతము హెచ్చినకొద్దీ ఈమొత్తంకూడా

హెచ్చింపవలెనని నంద్యాలలో కూడిన ఆంధ్రరాష్ట్ర సంఘం శిఫార్సు చేసింది. నెల జీతం 500 న్నూ అంతకు మించి అయితే నూటికి 30 వసూలు చేయవచ్చు. 1000 నుంచీ పైన నూటికి 35 వసూలు చేయవచ్చు. స్వయంగా ఇచ్చుకోవటానికి ఒప్పుకోక పోతే నిర్బంధించక తప్పదు. రైతులభారాన్ని కొంతగాక కొంత అయినా తగ్గించి జాతీయాభివృద్ధికైన పనికి తోడ్పడాలంటే ఇదిగాక వేరుమార్గం లేదు. 'అన్యథా శరణంనాస్తి.'

## జైళ్లు, పోలీసు సిబ్బంది.

పోలీసువారియొక్కయు జైలు ఉద్యోగులయొక్కయు గ్రామోద్యోగుల యొక్కయు కర్తవ్యాన్నిగూర్చి విరివిగా ప్రచారమూ ప్రబోధమూ జరగవలెను. ఈఉద్యోగులందరును తమ సంరక్షణలోనున్నవారి మేలు కయియే తాము పాటుపడ వలెనను విషయమును గుర్తెరుంగునట్లు చేయవలయును. జైళ్లవిక ఏమాత్రమూ నరక తుల్యముగా ఉంచగూడదు. రష్యన్ జైళ్లపద్ధతిని చాలావరకు అనుకరించాలి. వివరాలు చెప్పటానికిది తావుగాదు. గ్రామోద్యోగులు పల్లెజనులను నిరంకుశ ముగా పీడింపగూడదనిన్ని, పల్లెజనులకు మిత్రులుగను, బోధకులుగను, మార్గదర్శ కులుగను మెలంగుచు వారి పరిస్థితులను బాగుచేయవలయునను విషయము సదరుద్యో గులకు తెలియజెప్పవలెను. ఆవిధంగానే పోలీసులుగూడా దేశంలో ఒక క్రొత్త శకం ఆరంభమైనదనీ ఈశకంలో స్వరాజ్యం కోరటం నేరంకాదనే విషయాన్ని గ్రహించేట్లు చెయ్యాలి. ఇన్నెందుకు? వీరి దృక్పథమే పూర్తిగా మారిపోవాలి. ప్రజలు తమ్ములను మిత్రులనుగా లెక్కించుకొనవలెనని వీరాశింపవలెను. ఇందు లకు ప్రజలను సేవించుటయందును నేరములను రూపుమాపుటయందును, తప్పుచే యుచున్న పౌరులను సరియగు త్రోవకు తీసికొనివచ్చుటయందును సహాయములేని వారికి సాయముచేయుటయందును గల మహాత్మ్యమును వీరెరుగునట్లు చూడవలయును.

## లంచగొండితనం పోవాలి

ఈపరమపాతకాన్ని మఱచి పోగూడదు. ఈలంచగొండితనం ప్రభుత్వ యంత్రంలో ప్రతిమూలకీ వ్యాపించింది. రైల్వేలో గుడ్సుట్రాఫిక్ సంగతి చెప్ప నక్కరలేదు. ఎవరికన్నా ముడుపు చెల్లించనిదే కోర్టువ్యవహారాలు జరుపుటయూ దావాలు అమలు పరచుటయూ బిల్లరకములు జరుగుటయూ అసంభవం. ఎవరికో ఒకరికి మట్టజెప్పుకోనిదే తాలూకా ఆఫీసునుంచి ముజరా రాక భీష్మించుకుం టుంది. ఈవిషయంలో రిజిస్ట్రేషన్ పి. డబ్ల్యు. డి శాఖలు రెండూ ఓదానికోటి తీసిపోవు. కాని ఈమధ్య పరిస్థితులు బాగుపడ్డట్టు తోస్తుంది. పి. డబ్లియు. డి. శాఖలోను లోకల్ బోర్డులలోను జరుగుతున్న కంట్రాక్టుల కుట్రను ఇక్కడ ఎత్తుకో కుండావుంటే మంచిది. మామూళ్ళు కృత్రిమంగాఉండే స్థితిపోయి అతిసహజం అయి

నవి. ఈవిషయంలో ఏమాత్రమూ కించ పొందటానికి స్థానంలేదు. వాస్తవానికి లంచంకోరని ఉద్యోగస్థుణ్ణి వ్యాపారస్థులంకరూ తిట్టిపోస్తారు. కాబట్టి సరియైన త్రోవలో పెట్టవలసింది ఒక్క ఉద్యోగస్థులనే కాదు, ప్రజాసామాన్యాన్నికూడా మంచి త్రోవలో పెట్టాలి. వారికి కూపాలన్నిటిని శుభ్రంగా కడిగివేయాలి మన జాతికున్న శక్తి సామర్థ్యాలనన్నిటినీ ఏకోన్ముఖంచేసి ఈపని నెరవేరేటట్లు కృషి సలపాలి.

## న్యాయశాఖ ప్రభుత్వము.

ఈపరీక్ష చాలాకాలంనుంచి వేధించుకొని తింటోంది, చాలా సంవత్సరాలనుంచీ కాంగ్రెసు సభలో తీవ్రవాదాలు చెలరేగినవి న్యాయపాలనాధికారమూ ప్రభుత్వ పాలనాధికారమూ— ఈరెంటినీ కలిపిఉంచే విధానాన్ని వెంటనే మార్చివేయాలి. 144 శిక్షను ప్రయోగించటమూ దీన్ని ఉల్లంఘించిన వారిని శిక్షించటమూ— ఈరెండుపనులూ చేస్తూన్న కలెక్టరుకి ఈఅధికారం ఉండకూడదు. పైనుంచి క్రిందిదాకా ఈపద్ధతినే అవలంబించాలి. ఈరెండధికారాలనీ వేరుచేయాలి. ఈసందర్భంలో కోర్టులనుగురించి న్యాయపాలనను గురించి ఓమాట చెబుతాను, న్యాయశాఖవలన కలుగు జాగు ఖర్చు అస్థిరతవల్ల సందిగ్ధత కొంత అవకాశమేర్పడినదన్ని, తీర్పుచెప్పు స్థానమునకును నేరము సంఘటిల్లిన స్థానమునకును ఎట్టి సంబంధమును లేకపోవుటవలన జరుగవలసిన న్యాయము జరుగకపోవుట, యున్నూ అందఱకును తెలియును. పంచాయతులను పైకి తీసుకరావాలి. మాటిమాటికి కోర్టుకుపోకుండా చేయాలి. 'అప్పీలు' చేసికొనుట సాధ్యమైనంతవరకు తగ్గిపోవాలి. లా రిపోర్టులు వీలైనంతవరకు లేకుండా చేయాలి. మాట్లాడిన మాటకి మారుమాటలేకుండా ఉండాలి అవిధంగా సత్యమూ సత్యభాషణమూ పూర్వగౌరవాన్ని మళ్ళీ పొందాలి

## ఖద్దరు సహకారశాఖ

కాంగ్రెసు పని కనుకూలమైన ఒక శాఖనుగూర్చి ఇచట విస్తరింపవలయును. అది సహకారశాఖ. తోటి శాఖలైన వ్యవసాయ పరిశ్రమల శాఖనుండి దీనిని వేరు చేయ వీలులేదు. పరిశ్రమలశాఖ చేయూతనిచ్చు పరిశ్రమల ఉత్పత్తి, సరఫరాలు సహకారశాఖద్వారానే జరుగగలవు. ఖద్దరు విషయం తీసికుందాం. పరిశ్రమల శాఖ పల్లెటూళ్ళలో ఖద్దరుకు వలసిన ఏర్పాటులు చేస్తుంది. మన దేశానికి అధమం 35000—50000 ల లక్షల గజాలగుడ్డ అవసరం దీంట్లో చాలాభాగం దేశవాళీ మిల్లులు తయారుచేస్తున్నవి. అయినప్పటికీ ఇంగ్లండునుంచి $9\frac{1}{2}$ కోట్ల రూపాయల విలువగల బట్టనీ, జపానునుంచీ అదే మొత్తాన్నీ దిగుమతి చేసుకుంటున్నాం ఈవిషయం ఉపేక్షించతగ్గది కాదు. మనం దిగుమతి చేసుకుంటున్నందుకు ప్రత్యామ్నాయంగా ఆదేశాలీ బట్టకి కావలసిన ప్రత్తిని మన దేశాన్నుంచి దిగుమతి చేసుకుంటు

న్నవి. దీన్నట్లావుంచి మన మగ్గాలస్థితి చూస్తే ఇన్నాళ్ళ విజ్ఞానాలు ఉపయోగించి మనకి కావలసిన బట్టలో కొంతభాగాన్ని ఉత్పత్తి చేస్తున్నావి. ఇప్పుడు మనం గ్రామవాసులకు సాయం చేయాలి. అంటే ఒక్క సాలె వాళ్ళకే కాదు నూలు తీసేవాళ్ళకు కూడాను. ఏర్పాట్లన్నీ ఖాదీ శాఖ ద్వారా జరగటానికి వీలుంది. కాని సరకును కూడదీసి చేయవలసిన భారం సహకార శాఖది.

## ఖద్దరుత్పత్తి.

ఈసరుకు నుత్పత్తి చేసే బాధ్యత సహకారసంఘాలకి వప్పజెప్పటంలో కొన్ని కష్టాలున్నవి. ఈపనిలో సంఘాలు దెబ్బతినటానికి అవకాశం ఉంది. ఈసంఘాలే నష్టం భరించవలసివుంటుంది. ఇట్లా నష్టాలు జరిగితే సంఘం దివాలా తీయవలసి వస్తుంది కాబట్టి ఉత్పత్తికి సంబంధించిన ఏర్పాట్లనన్నిటిని అ. భా. చ. సంఘం వారి చేతుల్లోనూ, వారి బ్రాంచీలకూ వదలివేయవచ్చు. అయితే సరఫరా అంతా సహకారశాఖద్వారానే జరగాలి. ఈపనికి ప్రతిబంధకమైన నిబంధనలేవీ గ్రామసహకార సంఘ నియమావళిలో లేవు. కాని ప్రభుత్వమవలంబించివుండిన విధానం దీనికేవిధంగానూ సుముఖంగా వుండకపోవుటచేత ఈపనిని చేబట్టటానికి వీలులేకపోయింది. చేబట్టివుండినా విరమించవలసివచ్చింది. ఒక తహశీలులో ఈసంఘాలద్వారా వేలరూపాయల విలువగల బట్ట సరఫరా అవుతూ వుండుటయు దీన్ని ఒక్కసారి అమాంతంగా ఆపివేయుటయూ జరిగినది. దీనికి చాలా దృష్టాంతాలున్నవి. ఈవిషయంలో ప్రభుత్వ విధానం మారవలె. గ్రామసంఘాల నిబంధనానుసారంగా జరగటానికి ఎట్టిఅభ్యంతరమూ లేని ఈపనిని ఆపటానికి డిప్యూటీ రిజిస్ట్రారు ఎట్టిజోక్యమూ కలుగజేసికొనగూడదు. మన చెన్నరాజధానిలో 17,000 సహకారసంఘాలున్నవి. వీటిలో ఏడువేలను వదలివేసి మిగిలిన పదివేల సంఘాలైనా సాలుకి రూ 500 ల కిమ్మతుగల బట్టను అమ్మగలిగితే మన ఒక్క రాష్ట్రంలోనే 50 లక్షల రూపాయల ఖద్దరు విడుదల అవటానికి అవకాశం ఉంది., గ్రామాల్లో ఇప్పటికిప్పుడే ఇంతబట్టను అమ్మకానికందజేసే వీలులేకపోవచ్చు. కాని పని సరిగా జరగటానికిదే మార్గం. బట్ట పట్టణములలోకంటే గ్రామములలోనే ఎక్కువగా విడుదల అవాలి. ఓమూల బట్ట ఖర్చవుతూఉంటే సహజంగా రెండోమూలనుంచి బట్ట తయారవుతూ వుంటుంది. కాబట్టి ప్రభుత్వవిధానం ఓమూల బట్ట తయారవుతూవుంటే రెండోమూల అది విడుదల అయేమార్గాలను అన్వేషించవలసియుంటుంది. ఈపద్ధతి నాలోచించి అ. భా. చ. సంఘంవారితో కలసి అమలులోకి తీసుకువస్తే పల్లెటూళ్ళలో పనిలేనివారికి చాలా లాభదాయకమైన పని కల్పించినట్లుంటుంది.

## ఊరూరాతిరిగి అమ్మటం

దీనికి తోడుగా ఊరూరతిరిగి అమ్మేటందుకు సదుపాయాలు చేసి సాయం చేయాలి. ఇంతవరకూ పట్టణాల్లో అమ్ముడుబోయిన బట్టమీద అదితిగా నూటికి

6-4-0 న్నా గ్రామాల్లో అమ్ముడుబోయిన బట్టమీద అదితీగా నూటికి 9-4-0న్నా ఇస్తోంది. అయితే ఏడాది మొత్తంమీద గ్రామంలో రు 600 లకు మించి అమ్ముడు పోతేనే ఈ 9-4-0 ఇస్తారు. కాని ధనాభావంచేత ఇప్పుడీపద్ధతి మానివేయాలసి వచ్చింది ఈధనాభావంవల్ల పల్లెటూళ్ళల్లో క్రయం తగ్గిపోయింది గ్రామాల్లో ఖద్దరమ్మటానికి గాను ప్రభుత్వం కొంతడబ్బును ప్రత్యేకించవచ్చు. ప్రభుత్వం ఇంకోవిధంగాకూడా ఖద్దరుకు తోడ్పడవచ్చు. ఇదేమిటంటే వివిధ స్థలాలలో ఖద్దరు పరిశ్రమలో ఉన్న [illegible] పనిముట్లు మొదలైనవి ఇవ్వటం. రాటాలు [illegible]. వీటిలో చాలా మార్పులున్నవి. ఒకచోట ఉన్న రాటానికి ఇంకొకచోట ఉన్న రాటానికి పోలిక ఉండదు. కాబట్టి దీన్ని ఉన్నస్థితికి తీసుకరావాలి

అ. భా. చ. సంఘంవారు [illegible] రాటాన్ని కనిపెట్టారు కదురుబుడిపె [illegible] చక్రం [illegible] ఏ లెక్కనిబట్టి ఉండాలో నిర్ణయించారు సరియైన కదుర్లను తయారుచేయవలసి వుంటుంది. ప్రభుత్వం వీటిని విలువచేసి కావలసిన వారి శక్తినిబట్టి ఖరీదు తీసికొనియో లేక ఉచితంగానో వీటిని సరఫరా చేయవచ్చు.

## ప్రత్తిని నిలువచేయుట.

ప్రభుత్వం చేయగల్గిన సహాయం మరొకటికూడా ఉంది. ఖద్దరుకు వలసిన ప్రత్తి పంటను ప్రభుత్వమే నిలువచేయవచ్చును. ప్రత్తి పంటకువచ్చు సమయమున కొనుటకు డబ్బులేక ఖరీదులు జాస్తిగానున్నపుడు హెచ్చు రేట్లివ్వవలసివచ్చి అ. భా. చ సంఘంవారు నష్టపడుతున్నారు ఇందువల్ల ధరలు ఒకేరీతిగా ఉండటానికి వీలులేకపోతోంది. రాష్ట్రప్రభుత్వాలు కావలసిన ప్రత్తి పంటనూ కొని వివిధప్రదేశములలో నిలువయుంచేట్లయితే యీకష్టాన్ని దాటవచ్చు.

ఈపరిశ్రమలోను వ్యాపారంలోను అనేక మార్పులు తీసుకరావటంమూలంగాకూడా ప్రభుత్వంవారు అ. భా. చ సంఘానికి సాయం చేయవచ్చు. ముందుగా ప్రత్తిని ఏకటం ఏకులు తయారుచేయటం ఈరెండు నూలు తీసేవారే చేసేట్లు చూడాలి. ఇంతవరకు ఈపద్ధతినిగూర్చి ఎట్టి శంకలుంటున్నప్పటికి ఇప్పుడట్లాంటిదానికి స్థానంలేదు. తమంతటతామే ఏకులను చేసుకొనేటట్లయితే ఇంకా సన్నపు నూలు ఎక్కువ ప్రమాణంలోకూడా తీయగలమని ఎరిగి దారం వడుకువారు [illegible]. [illegible] ఉత్తమమైన ఏకులందేటందుకున్నూ, స్వయంగా ఏకులను [illegible] చేసుకొనటం నేర్పించుకున్నా [illegible] మించాలి అయితే ఖద్దరు సంఘాలే వీటిని భరించటానికి తగిన వీలులేదు ఎందుకంటే అసలు లాభమే అత్యల్పము. వీటంతటిని సర్కారువారే భరించాలి. ఎందుకంటే ఇదీ [illegible] వృత్తినిద్ధ [illegible] ఈభారం [illegible] వహించవలసిన కర్తవ్యం ప్రభుత్వానిది.

## ప్రభుత్వంనుంచి అప్పు.

చరఖాసంఘంద్వారా ప్రభుత్వంనుంచి వడ్డీ లేకుండా అప్పు తీసుకోవాలని కొంతమంది సూచన చేశారు. కాని ఇందులో చాలా కష్టంఉంది. తామిప్పిస్తు న్నారు కాబట్టి జరుగుతున్న పనినంతనీ ప్రభుత్వం పరీక్షచేయగోరుతుంది. అప్పులు తీసుకోవటంవల్ల దఫాలవారీగా మళ్ళా తీర్చవలసి వుంటుంది. కాని ఒకసారి పరి శ్రమకోసం ఖర్చైపోయినది అందులో ముఖ్యంగా గిట్టుబాటుకాని ఖద్దరంటి పరిశ్రమవిషయంలో దఫాలవారీగా డబ్బు మొట్టటం కష్టం అయితే డబ్బెక్క డికీ పోలేదు, మంచిపనికోసం ఖర్చైంచి, ఏనాటికైనా రాకపోగని మాత్రం సంతుష్టిపొందవచ్చు, కాని బ్యాంకులు వ్యవసాయపు పనులకోసం బదులిచ్చి మళ్లీ పంటలో వసూలు చేసుకుంటున్న విధంగా ఖద్దరు విషయంలో చేయాలంటే కుదు రదు ఇంకా ప్రభుత్వంపరీక్షచేసి కనుక్కుంటూవుంటే ఇదొక బెడదఅవుతుంది. కాబట్టి ఇవన్నీ కలిపి ఆలోచిస్తే ప్రభుత్వాన్నుంచి అప్పుకోరటం బాగుండదని తోస్తుంది.

## నేత బడులు

ఖద్దరుకు సహాయంచేసే మార్గాన్ని గూర్చి ఆలోచించేటప్పుడు ఈపరిశ్రమని గూర్చి సాకల్యంగా ప్రత్తిపండించటంనుంచీ బట్ట విడుదల అయేటంతవరకూ గూడా ఆలోచించవలసిందే. సప్లయిలో ఏమాత్రం జాగువస్తే పనివాడు పనిలేక కాళ్ళు ముడుచుకొని కూర్చోవలసి ఉంటుంది. అట్లాంటి సమయంలో కూలి లేకపోవటం అట్లాఉండంగా, సప్లయి ఎప్పటికి జరిగి మళ్ళీ తనకికూడు సమకూరేది తెలియకపోవ టంవల్ల అతడికి నిరాశ కలుగుతుంది ప్రభుత్వం స్వయంగా పండిస్తూవున్న ప్రత్తి పంతను ఖద్దరుశాఖ కొందించవచ్చు నేతవాండ్రు వడుకువారున్న స్థలాల్లో వ్యవ సాయ శాఖవారితో సంప్రదించి ప్రత్తి పండించవచ్చునేమో విచారించవచ్చు. అట్లాగా ప్రత్తిపండుతూవున్నచోట నేతవాళ్ళు వడుకువాళ్ళు లేకపోతే ఈరెండు పనులూ అక్కడివారికే ఖాళీసమయంలో పనిగల్పించేందుకుగాను నేర్పవలెను.

మనమిపుడు ఖద్దరునుగూర్చి మాట్లాడుకుంటూ ఉంటున్నాం కాబట్టి, మిగి లినపరిశ్రమలకు ఆపరిశ్రమలను శాస్త్రీయంగా నేర్పే బడులుంటే, ఖద్దరుకుగూడా లేకపోవటమేమిచెప్మా అనిపిస్తుంది. సెంట్రల్ వీవింగు (నేత) ఇన్‌స్టిట్యూట్ ఒకటి చెన్నపట్నంలోఉంది. మిల్లునూలు నేసేందుకు ఇండియా ప్రభుత్వంవారు పెద్ద మొత్తాన్ని ప్రత్యేకించారు. ఖద్దరునే నేసేటందుకు ఒక కార్ఖానును ఏర్పరచ వచ్చు. ప్రత్తిని శుభ్రంచేసి గింజలు తీయటంనుంచీ ఏకి, ఏకులుచేసి నూలుతీసి మగ్గంమీదనేసి, బట్ట ఉడకవేసి రంగువేసి అద్దకమద్ది కావలసిన హంగంతా చేసి

విడుదలచేసేంతవరకూ ఉన్న ఈ అంశాలన్నిటిలోను నేర్పరితనాన్ని బోధించవలె. ఉత్తరదేశానికొకటి దక్షిణ దేశానికొకటి ఇట్లాంటిసంస్థను ఏర్పాటుచేయవచ్చు!

మంత్రులు అధికారమును చేతబూని ఇచట వివరించిన సంస్కరణలను నెరవేర్చు సామర్థ్యమును చేకూర్చుకొనిన వెనుక ఒక్కొక్క గ్రామమును లేక కొన్ని గ్రామముల గుంపును స్వాయత్తము చేసి వ్యవహారవివరము లన్నిటిని నిర్వర్తింపజేయువిధానమును సాధించుట వీరి కుత్తమ కార్యమై వెలయగలదు. విద్య, సహకారము, పారిశుద్ధ్యము ప్రజారోగ్యము— వీటివిషయము ముఖ్యముగా గమనించుచు ఈస్వాయత్త సంస్థలు శిస్తులను వసూలుచేయుట, దండవిధి, దావా వ్యవహారములను పరిష్కరించుట మొదలైన పనులనుగూడ నిర్వర్తింపవచ్చును. ఈ పనికి ప్రతిగ్రామమునకు కాకపోయినను కొన్ని గ్రామములకైనను ఒక్క పంచాయతీ గాక రెండు పంచాయతీలవసరమై యుండును. అయితే, లెక్కలు వ్రాయటానికి భూముల అజమాయిషీకి గ్రామానికి సంబంధించిన వివరములను సంగతులను తెలిసికోవటానికి కరణం అవసరం. ఈలెక్కలు చాలా చిక్కుగా వుంటవికాబట్టిన్నీ భూములను స్వయముగా తనిఖీ చేయవలసివుంటుందికాబట్టిన్నీ కరణం లేకుండా ఈపని జరుగదుకాబట్టి ఇపుడు గ్రామోద్యోగుల వంశపారంపర్య హక్కుల నేమాత్రము ముట్టగూడదు రివిన్యూ ఇనస్పెక్టరును తహసీల్దారు కలెక్టర్లను గాక ఈ వ్యవహారాలన్నిటికి పరిష్కర్తలై ఈస్వాయత్త సంస్థలకే గ్రామోద్యోగులు కట్టుబడి ఉంటారు. వీటన్నిటికి వీరిదే జవాబుదారీ ఐయుంటుంది ఈపద్ధతిని అమలులోనికి పెట్టినపుడు అనేక చిన్నచిన్న మార్పులు చేయవలసిఉంటుంది. ఏమైనప్పటికి గ్రామాలను మళ్ళా స్వాయత్తం చేయవలసివుంటుంది.

## ముగింపు.

శ్రీగాంధి జయంత్యుత్సవ సందర్భమున వ్రాసిన వ్యాస పరంపర ఇంతతో ముగిసినది.

శ్రీగాంధిమహాత్ములు తొలినుండియు ఆచరింపవలసియున్నదని తెలుపుచున్న ప్రణాళిక ఈనాటికిని పూర్తిగా ఆచరింపబడలేదు. ఏనాటికైనను ఆప్రణాళిక అవలంబింప బడనిదే స్వరాజ్యము చేకూఱదు.

ఆయన అహర్నిశమును ఈలక్ష్యప్రాప్తికయియే పాటుపడు చున్నాడు. అరువదితొమ్మిదేండ్లు నిండినవి. వృద్ధాప్యమువలన ఆయన దేహయాత్రము కష్టించినను బడలిక జెందుచున్నాడు. ముందేమి కానున్నదో యని భయము కలుగుచున్నది. ఈసమయమున ఆయన నాత్మ నానందింపజేయుటకు ప్రార్థనయే శరణ్యము. ఆయన జీవితమునంతను ఏలక్ష్యప్రాప్తికై వినియోగించినాడో ఆలక్ష్యప్రాప్తికై మనమందఱము పాటుపడుటయే ఆయనకు ముదమును గూర్పగలదు- అయ్యదియే మనకర్తవ్యము ఇక నిట్లు ముగింతము:

“ సహనావవతు
సహానౌ భునక్తు
సహావీర్యం కరవావహై ।
తేజస్వినా వధీత మస్తు
మా విద్విషావహై ।
ఓం శాంతిః శాంతిః శాంతిః ”

